# సొగసుచిందే శింగార్ కుంకుమ్ మామూలు కుంకుమ్ వెలలో

శింగార్. అవును అదీ మేలైన కుంకుమ్. రాలిపోదు, కారిపోదు, చిట్లిపోదు, మచ్చలు పడదు. అందమైన నుదురుకు మరింత అందాన్నిచ్చే కుంకుమ్–శింగార్. ఉత్కృష్టమైన పదార్థాలతో తయారుచేయబడింది. రెండు రకాల జాడీలలో దొరుకుతుంది.

- చిన్న జాడీ - 60 పైసలు ( 45 రోజులకు సరిపోతుంది )
- పెద్ద జాడీ - రూ. 1/- ( 90 రోజులకు సరిపోతుంది )

నకిలీవి వస్తున్నాయి జాగ్రత్త, శింగార్ పేరు చూసి కొనండి.

## మేలైనది, పొదుపైనది శింగార్ కుంకుమ్ జాడీ






నకిలీవి వస్తున్నాయి జాగ్రత్త శింగార్ పేరు చూసి కొనండి.

ప్యారమౌంట్ ప్రోడక్ట్స్.
809, ప్రసాద్ ఛాంబర్స్, బొంబాయి 400 004.

everest/78/SH/226-ll

అసలి - నకిలి బిందీ పోటీలలో పాల్గొనండి - ఎంట్రీఫారము కొరకు మీ డీలరును అడగండి

# అమృతాంజన్ పోటీ

## లక్ష రూపాయల విలువగల బహుమతులు గెలవండి!




ప్రథమ బహుమతి
ప్రిమియర్ పద్మిని కారు
లేదా నగదు రూ. 40,000



ద్వితీయ బహుమతి బంగారు నగ
లేదా నగదు రూ. 15,000



650 ఇతర బహుమతులు
మొత్తం విలువ రూ. 45,000

మీరు చెయ్యవలసింది చాలా సులభం దిగువ పేర్కొన్న బాధల జాబితాలో వేటికి అమృతాంజన్ ఎక్కువ ఉపయోగకరంగా వుంటుందో—వరుస క్రమంలో రాయాలి.

| | | |
|---|---|---|
| a. కీళ్ల నొప్పులు ☐ | d. కండరాల నొప్పులు ☐ | g. పంటి నొప్పి ☐ |
| b. దగ్గు/రొంప ☐ | e. బెణుకులు ☐ | h. ................ ☐ |
| c. తలనొప్పి ☐ | f. వాపులు ☐ | |

కండరాల నొప్పులకి అమృతాంజన్ దివ్యంగా పనిచేస్తుందని మీ అభిప్రాయం అనుకోండి, అప్పుడు 1 అని (d)కి ఎదురుగా రాయాలి. ఈ లిస్టులో లేని ఏ ఇతరమైన బాధా నివారణకైనా అమృతాంజన్ సూచించేటట్లయితే (h)కి ఎదురుగా రాయవచ్చు. తరువాత 15 మాటలకు మించకుండా "అమృతాంజన్"ని గురించి ఒక వాక్యము రాయాలి.

______________________________

______________________________

పేరు ______________________________

చిరునామా ______________________________

మీరు ఎన్నైనా పోటీ పత్రాలు పంపవచ్చు. కాని ప్రతి దానిలోనూ 12 గ్రా. అమృతాంజన్ సీసా కాళీ పెట్టెను జతపరచి పంపాలి.

నిబంధనలు:

1. ఈ పోటీలో అమృతాంజన్ లిమిటెడ్ వారి ఉద్యోగులు ప్రకటనదార్లు, వారి బంధువులు మినహాయించి భారతీయులంతా పాల్గొనవచ్చు.
2. పోటీ పత్రాలు పెన్సిలుతో నింపినవి, స్పష్టంగాలేనివి, తగినన్ని స్టాంపులు అతికించనివి, స్టాంపులు లేనివి పోటీకి అంగీకరింపబడవు.
3. రవాణాలో పోయిన, ఆలస్యంగా చేరిన, పోటీ పత్రాల బాధ్యత స్వీకరింపబడదు.
4. పోటీ పత్రాన్ని ఇంగ్లీషులోగాని, ఏ ఇతర భారతీయ భాషలోనైనగాని పూరించవచ్చును.
5. పోటీ పత్రాలను న్యాయ నిర్ణేతల సంఘం పరిశీలిస్తుంది, వారిదే తుదితీర్పు, దానికి కట్టుబడి ఉండాలి.
6. పోటీ విషయంలో ఉత్తర ప్రత్యుత్తరాలు జరుపబడవు.
7. అమృతాంజన్ లిమిటెడ్ వారికి చేరిన పోటీ పత్రాలు వాటిలోని విషయాలపై సర్వ హక్కులు అమృతాంజన్ లిమిటెడ్ వారికే చెందును.
8. బహుమతులు పంపడం, వాటికి సంబంధించిన నిబంధనలకు లోబడి వుంటుంది.
9. పూర్తి చేసిన పోటీ పత్రాలతోబాటు 12 గ్రా. అమృతాంజన్ సీసా కాళీ పెట్టె జతపరచి కవరలో పెట్టండి. దానిమీద "అమృతాంజన్ పోటీ" అని స్పష్టంగా రాసి, అమృతాంజన్ లిమిటెడ్, 14/15, లజ్ చర్చి రోడ్డు, మైలాపూరు, మద్రాసు 600 004 చిరునామాకు 1978 నవంబరు 30వ తేదీలోగా అందేలా పంపాలి.

AM-1989

ఆంధ్రసచిత్రవారపత్రిక

వ్యవస్థాపకులు :
దేశోద్ధారక కాశీనాథుని
నాగేశ్వరరావు పంతులుగారు
స్థాపితం : 1908

శివలెంక శంభుప్రసాద్
సంపాదకుడు :
[1938—1972]

శుక్రవారం : 17-11-'78
కాళయుక్తి నామ సం. కార్తీక బ. తదియ
సంపుటము 72 : సంచిక 10

సంపాదకుడు :
శివలెంక రాధాకృష్ణ

*

పోస్టులో ఏడాది చందా రు. 41-60
ఆరు మాసాల చందా రు. 20-80
విడి ప్రతి వెల 75 పైసలు

ఆంధ్రపత్రిక కార్యాలయము
గాంధీనగరం, విజయవాడ-520 003


## విషయానుక్రమణిక


అట్టమీద బొమ్మ :
చిన్నారి చిలిపి చూపులు
[ఫోటో : కె. సత్యనారాయణప్రసాద్]

కథలు :
తేడా ... 16
రమా—నేనూ—సరోజా ... 36
నీరజ పెళ్ళి ... 45
మీరే చెప్పాలి ... 49

సీరియల్ కథలు :
రాగద్వేషాలు ... 8
ఆకర్షణ—వ్యామోహం ... 20

వ్యాసాలు, శీర్షికలు :
ఉత్తరాలు, లోకం పోకడ-5. హైదరాబాద్ నోట్ బుక్-7, ప్రశ్నావళి-15, రెండవ టెస్ట్ ట్యూబ్ బేబీ దుర్గ-19. వి.వి.జి. పేజీ-24, సినిమా-28, హైదరాబాద్ సినిమా-33, బొమ్మల మహాభారతం - 34. ధర్మపథం, డాక్టర్ సలహాలు-35, ఫాలాక్షుని డైరీ-43. వారఫలం - 44, నైస్సులో పరదాలు-47. వంటలు-50.




### ముఖచిత్రం

20-10-78వ తేదీన అట్టమీద బొమ్మ "శ్రీ కలకత్తాదుర్గ"తో వెలువడిన ఆంధ్ర సచిత్ర వారపత్రిక అత్యంత ఆకర్షణీయంగా వుంది. ఈవారం కథలు, సీరియల్ కథలు, వ్యాసాలు, శీర్షికలు చూడటానికి చాల ఇంటరెస్టుగావుంది. ముఖ్యంగా కార్టూన్లు ఈ వారం బాగున్నవి.

వెంకటమహంతి మన్మథపట్నాయిక్
[బరంపురం]

* * *

20-10-1978 కలకత్తా దుర్గ దసరాసంచికతో వెలువడిన ఆంధ్ర సచిత్ర వార పత్రికలో ఈనాటి వనితాలోకంలో కొమ్మారెడ్డి స్వప్నగారి వ్యాసం "రచయిత్రులమీదఅగ్రహంఎందుకు"లో ఆమె అభిప్రాయాలు వాస్తవికానికి చాలదగ్గరగా వున్నాయి. ఆమె అభిప్రాయాలుచాలవిలువైనవిగా వున్నాయి.

జపుశీరాజేశ్వరి, యాజికి ప్రేమలత,
వనజలతాప్రభాకర్, అరుణా శ్రీనివాస్,
[పెందేకల్]

* * *

13-10-78వ తేదీనవెలువడిన నటి "శ్రీవిద్య" ముఖచిత్రం చాల చాల బాగుంది. 48వ పేజీలోని కార్టూను నన్ను ఎంతగానో నవ్వించింది.

పుష్పాల విజయలక్ష్మి, [బరంపురం]

### ఆసక్తికరం

ఈ మధ్య "ఆంధ్రపత్రిక" చూస్తూంటే మీరు దాని అభివృద్ధి కొరకు ప్రత్యేకంగా శ్రద్ధ తీసుకుంటున్నారనిపిస్తూంది. చక్కని ముఖ చిత్రాలు, మంచి కథలు, ఆసక్తికరమైన విషయాలూ ఉంటున్నాయి.

20-10-1978 తేదీ "దసరా సంచిక" ముఖచిత్రం "కలకత్తా దుర్గ" ఎంతో ఆకర్షణీయంగా ఉంది, ముఖ్యంగా కలర్ కాంబినేషన్ బాగా కుదిరింది. దేబ్‌దాసీ బెనర్జీగారికి కృతజ్ఞతలు. ఇక పత్రిక రాగానే ఉత్తరాలు పేజీ (5) నుండి ధర్మపథం (64) పేజీ వరకు వదలిపెట్టలేక పోయాను. అంత ఆసక్తి కలిగించేదిగా ఉంది కథల్లో "ఇదేం నాటకం" అనే కథలోని "తెల్లని యూనిఫారాల్లో ఉన్నవాళ్లు మామూలు అమ్మాయిలు కాదు సున్నం కొట్టిన సమాధులు. బాండేజ్ తెలుపుదనం వెనుక దాక్కున్న భయంకర గాయాల వీళ్ళ హృదయాలు" అన్న వాక్యాలు-సహజత్వానికి దగ్గరగా వైద్యశాఖ వారికి కనువిప్పు కలిగించేవిగా వున్నాయి.

## లోకంపోకడ – జోమెన్









## ఉత్తరాలు

ముగింపు కొంచెం డ్రమెటిక్‌గా అసహజంగా అనిపించింది. మొత్తానికి కథ బావుంది "విజయగంధం" (13వ పేజీలోని) లోని మొదటి మూడు వాక్యాలు నిరర్థకమేమో ననిపించాయి. స్వయంవరం" కథ చాలా బావుంది. ఈనాటి ఉద్యోగులకు ఇది మంచి గుణపాఠం. ఇక పరిహారం కథ వృథా. ఒక సెంటిమెంటును ఆధారంగా చేసుకొని వ్రాసే ఇలాంటి కథలు ప్రచురించి పాఠకులను అసంతృప్తి చెందనివ్వకండి. జి. వి. బి. పేజీలో (35 పేజీ) "పాఠకులకు లోగడ తెలిపాను" అన్నదానికి బదులు "పాఠకులకు లోగడ తెలిపాను" అని అచ్చయింది. "తిట్టడం తిట్టించుకోవడం" తప్ప మరో ప్రయోజనం లేనిది కె. రామలక్ష్మిగారి ప్రశ్నావళి. ఇక "పంటలు" శీర్షికలో కె. సీతగారు (44 పేజీ) "శాకాహారపు గ్రుడ్లు" అని వ్రాశారు. అర్థమేమిటో. ఇక "భారత — పాకిస్తాన్‌ల మధ్య క్రికెట్"... "నీళ్ళ నుంచి తీసే సూక్ష్మక్రిములు". "మాయమైన పర్వతం" చాలా బాగున్నాయ్. కార్టూన్లలో ఒకటి రెండు తప్పిస్తే తక్కినవి పాతవే అనిపించాయి. మొత్తానికి 85 పైసలు పెట్టి కొన్న పత్రిక అంతకు ఎన్నో రెట్ల విజ్ఞానాన్ని వినోదాన్ని అందించి. మిమ్మల్ని అభినందించేలా వుంది.

జాఫర్, సత్యం, [మహబూబ్‌నగర్.]

### విజ్ఞప్తి

కార్మికులకూ, వ్యవసాయ కూలీలకూ, పేద రైతులకూ, మధ్యతరగతి కుటుంబాలకూ, ఇతర ప్రజలకూ, సంబంధించిన జీవితాల్ని వాస్తవికంగా, చైతన్యవంతంగా, కళాత్మకంగా చిత్రించే నాటికలనూ, నాటకాలనూ, పాటలనూ, కథలనూ సంపుటాలుగా ప్రచురించడానికి "జనసాహితీ, సాంస్కృతిక సమాఖ్య" నిర్ణయించింది.

జనసాహితిలో సభ్యులుగా వున్నవారే గాక, ఇతరులు కూడా తమ రచనలు పంపవచ్చును.

భూమి సమస్య, ఫ్యాక్టరీ కార్మికుల జీవితం, సమ్మెలు, గనికార్మికుల సమస్యలు, నిరుద్యోగం, కులవ్యవస్థ, గిరిజన సమస్యలు, పౌరహక్కులు, విద్యార్థుల సమస్యలు, మధ్యతరగతి జీవితం, గ్రామీణజీవితంలాంటి విషయాల్ని ఇతివృత్తాలుగా తీసుకోవచ్చును.

రచనలన్నీ 1978 డిశంబర్ 31 నాటికి ఈ క్రింది చిరునామాకు చేరాలి—


కె. రవిబాబు,
ప్రధాన కార్యదర్శి,
జనసాహితీ, సాంస్కృతిక సమాఖ్య,
నగరం,
తెనాలి ఆర్ ఎమ్ ఎస్.
గుంటూరు జిల్లా — 522 268

## హైదరాబాద్ నోట్ బుక్

# గ్రామాలలో గృహనిర్మాణం

రామచంద్రాపురం సమీపంలోని చాంద్‌నగర్ వద్ద హైదరాబాద్ అభివృద్ధి సంస్థ నిర్మించనున్న నూతన పట్టణానికి (టౌన్ షిప్పుకు) ముఖ్యమంత్రి డాక్టర్ చెన్నారెడ్డి అక్టోబర్ 4వ తేదీన శంకుస్థాపన చేస్తూ, వచ్చే ఐదేళ్ళలో 125 కోట్ల రూపాయలతో గ్రామాలలో పెద్ద ఎత్తున గృహ నిర్మాణం జరుగుతుందన్నారు. చౌకైన ఇంటి ఖర్చు 2500 రూపాయలకు మించదని, ఇలాటి ఇళ్ళు ఏటా లక్ష నిర్మిస్తామని, దీనికి 25 కోట్ల రూపాయలు కాగలవని ముఖ్యమంత్రి అన్నారు. గ్రామసీమలలో ఇళ్ళు కట్టుకునే వారికి వడ్డీ లేకుండా బ్యాంకు రుణాలు, ప్రభుత్వం సబ్సిడీ లభిస్తాయని ఆయన వివరించారు. ఐదుకోట్ల మందికి ఐదులక్షల యిళ్ళు సముద్రంలో కాకిరెట్ట వంటిదే అయినా, కొందరికయినా గృహవసతి లభిస్తున్నందుకు సంతోషించాలి.

బాలల అభ్యున్నతి :—

"ఆంధ్రప్రదేశ్‌లో బాలలు" అనే విషయమై అక్టోబర్ 6,7,8 తేదీలలో గోష్ఠి జరిగింది. ఈ గోష్ఠిని అంతర్జాతీయబాలల సంవత్సరం రాష్ట్ర కమిటీ జవాహర్ బాల్ భవన్‌లో ఏర్పాటుచేసింది. గోష్ఠిని గవర్నర్ శ్రీ అబ్రహాం ప్రారంభిస్తూ, బాలల భవిష్యత్తు సుగమంగా వుండే కార్యక్రమం సిద్ధపరచాలన్నారు. శిశుసంక్షేమ శాఖామంత్రిణి శ్రీమతి రోడామిస్త్రీగోష్ఠికి అధ్యక్షతవహించారు.

వోటర్లకు గుర్తింపు కార్డులు :—

ప్రతి ఎన్నికలలోను దొంగవోట్లు చాల పడుతున్నాయి. వేలికి అంటించే నల్లసిరాను రసాయన ద్రవ్యాలతో తుడిచేసుకుని రెండు మూడు సార్లు వోట్లు వేసినవారు చాలమంది వున్నారు. మారు మనుష్యులతో వోట్లువేయించే పద్ధతి ప్రతి నాయకునికీ కొట్టినపిండి. కనుక వోటర్లకు వారి ఫొటో ముద్రవున్న గుర్తింపు కార్డులు ఇవ్వడాచేసేపద్ధతి వుండాలనే సూచనపై ఎన్నికల కమిషన్ పరిశీలిస్తున్నదని ఎన్నికల కమిషనర్ శ్రీ ఎస్. శె. శక్ధర్ అక్టోబర్ 17న పత్రికా ప్రతినిధులకు తెలుపడం శుభావహం. ఫొటోల సంగతి కొంచెం వ్యయసాధ్యమైనా న్యాయం చేకూర్చడానికి వుపయోగిస్తుంది.

నాయకులకు గుణపాఠం-ధర్మజ్యోతి :—

వస్తువు చారిత్రికమయినా, ఆధునిక నాటకాలను కూడా తలదన్ని సహృదయులను ఆకర్షించిన నాటకం అక్టోబర్ మొదటివారంలో రవీంద్ర భారతిలో ప్రదర్శించిన 'ధర్మజ్యోతి.' దీనికి కారణం శాశ్వత సాంఘిక ధర్మాలయిన చిత్తశుద్ధి, ధర్మభీతి, కృతజ్ఞత వంటివి ఈ నాటకాన్ని నడిపించడమే. ఏ రాజకీయ సిద్ధాంతం ముందుకు వచ్చినా, ఈ ధర్మాలు అవసరమే కదా! కనుకనే పౌరాణిక నాటకాలూ, చారిత్రక నాటకాలూ నేటికి ప్రేక్షకులను ఆకర్షిస్తూండడం. కుమారభోజుణ్ని పినతండ్రి ముంజరాజు మోసంచేసి రాజ్యం అపహరించబోతే, మంత్రీ, ఆస్థానకవీ, చివరకు ముంజరాజు ప్రియురాలు రాజనర్తకి ప్రతిఘటించి ధర్మాన్ని, న్యాయాన్ని సమర్థిస్తారు. ఇది నేటి రాజకీయనాయకులకు కనువిప్పు. నాటక రచయిత శ్రీ కొర్లపాటి శ్రీరామమూర్తి. సెట్టింగులు, దుస్తులు భారీగా వున్నవి నట్యుల నటన సముచితంగానేవుంది. దర్శకత్వం నిర్వహించిన శ్రీమతి మద్దూరి విజయలక్ష్మికి గొప్ప భవిష్యత్తు వుంది.

విమర్శామ్నాయ మణిదీపం రాళ్ళపల్లి :—

రాళ్లపల్లివారు (రాళ్ళపల్లి అనంతకృష్ణశర్మగారు) నాటికీ, నేటికీ, సాహిత్య జీవితంలోనూ, జీవితసాహిత్యంలోనూ పులుగడిగిన ముత్యాల రాశిగా, సాయంసంఫుల్ల మల్లీమతల్లికా గుచ్ఛంగా, అపరంజిపోత పోసిన దివ్యమంగళవిగ్రహంగా దర్శనమిస్తుంటారు.

"సాహిత్యపరమార్థం—అన్నికళలపరమార్థమూ—అలౌకికానుభవం, చిత్త సంస్కారమూను, ప్రపంచానికి అద్దంగా వున్నదా, లేదా, అన్నది చిన్నమెట్టు విమర్శం ఉండినది, ఉండవచ్చునది, ఉండవలసినది అనేవి ఉత్తరోత్తరం బలీయాలు.



రాళ్ళపల్లి అనంతకృష్ణశర్మ

దీనిని నైతిక, ధార్మిక, హార్దికమైన వాటికిఅన్వయిస్తాను. ఒక్కొక్క దానినుంచి మరొక్క దానికి వెళ్ళడమే నా ప్రయత్నం. ప్రయోజనాత్మకతకంటే, ఉన్నదున్నట్టు చూపడం కంటే, ఉండవలసినదిగా చూపడం పైస్థాయి." అన్నది ఈ విమర్శ ప్రస్థానాచార్యుల నిర్వచనం. ఈ శిష్ట విరుచి ప్రస్థానంవారు ప్రవర్తింప జేసినప్పటినుంచీ, సారస్వత రమకు అసదృశ నీరాజనంగాను, జిజ్ఞాసువులకు విమర్శామ్నాయ మణిదీపంగాను వెలుగొందుతున్నది. వారు ఆనందవర్ధనులుగా, అభినవగుప్తులుగా సాక్షాత్కరిస్తారు ఇటీవల వారిని దర్శించుకొన్నప్పుడూ సాహిత్యపరమార్థం విషయంలో సెలవిచ్చిందీ, ఇటీవలి వ్రాతలలో తెలిపిందీ ఇదే.

నిరుడు ఘనంగా వారిని సన్మానించి "అనంత రాగం" అనే పేర అభినందన గ్రంథం గొప్పగా ప్రచురించిన రాళ్ళపల్లి అభినందన సమితి (63, 2వ బ్లాక్, త్యాగరాజనగర్, బెంగళూరు—28) వారే ఇటీవల రాళ్లపల్లివారు వివిధ గ్రంథాలకు వ్రాసిన తొలిపలుకులు, ఆశీర్వచనాలు, మంగళశంసలు, సంపాదకీయాలు, పరిచయాలు మున్నగువాటిని "రాళ్ళపల్లి పీఠికలు" అనేపేర ప్రచురించి, సాహిత్యానికి ఎంతో సేవచేశారు 'పీఠికార్పణ'లో ఆచార్య జి.ఎన్. రెడ్డి అన్నట్టు "పీఠికారచన ఒక కళగా భావించి వైయక్తికమైన ముద్రతో విలక్షణమైన పక్కీలో పీఠికలు వ్రాయసేర్చినవారు మన కెందరో లేరు ఉన్నవారిలో అగ్రస్థానంరాళ్ళపల్లి వారిదే......పీఠికల్లో కూడ రాళ్ళపల్లివారి శైలి విలక్షణం, అననుకరణీయం, విషయభేదాన్నిబట్టీ, అభిప్రాయ ప్రకటనోద్దేశాన్నిబట్టి ఇంపైన వంపు సొంపుల ఒయ్యారింపులతో నడయాడుతూ వుంటుంది." తెలుగు సాహిత్యానికి అలంకారాలయిన ఈ రెండు గ్రంథాలను అందించిన అభినందన సమితిని, సంపాదకులు శ్రీయుతులు ఆర్.వి.ఎస్. సుందరం, పుట్టమరాజు అశ్వత్థనారాయణ, శివలంక శ్రీరామచంద్రమూర్తిగార్లను అభినందించకతప్పదు. రాళ్ళపల్లివారు ఆధునికులకు దీపస్తంభంగా మరిపది నూరు సంవత్సరాలయినావెలుగాలని నా ఆశ. వారికి ఇప్పుడు—మహా వుంటే—88 సంవత్సరాలే.

శ్రుతి :—

"చిక్కమగళూరు లోక్‌సభ ఉపఎన్నికలో ఏమవుతుందిసార్?"—అనడిగారు ఒక రాజకీయ జిజ్ఞాసువు నన్ను. "ఏంకావాలని మీ ఆశ?"—అని ఎదురుప్రశ్న వేశాను.

"యదభావి నతద్ భావి,
భావిచేన్నత దన్యథా—
కానిది కానేకాదు, అయ్యేది వేరె విధంగాకాదు—అని మన పెద్దలు ఎప్పుడో చెప్పారండీ" అన్నారు మా మాటలను వింటున్న ఒక తత్త్వవేత్త.

— తిరుమల రామచంద్ర

సీరియల్

# రాగద్వేషాలు

శ్రీమతి మాధవపెద్ది పుణ్యశీలాప్రసాద్

"నా ఇందు నా బంగారు తల్లి ఎప్పుడూ నవ్వుతూ- సంతోషంగా ఆడుతూ పాడుతూ వుండాలి. దిగుళ్ళు, చింతలు, దుఃఖం విషాదం అంటే ఏమిటో గూడా తెలియనట్లే వుండాలి. నీకేది కావల్సినా నే సమకూరుస్తాను. నీకు అన్నివిధాలా అండగ నేనున్నాను. నువ్వు ఇట్లా లోలోపల నీలో నువ్వే మథన పడుతూండడం లోపలి బిడ్డకు కూడా మంచిది కాదు.

*(గత సంచిక తరువాయి)*

నువ్వు సుఖంగా వుండడానికి నేను ఏదైనా చేస్తాను తల్లీ! ముందు సమస్య చెప్పు - పరిష్కారం ఆలోచిద్దాం- తరవాత. నీలో నువ్వే ఇట్లా కుమిలిపోవడం నేను చూళ్ళే నమ్మా! అసలు నీకతడ దగ్గర్నించి ఉత్తరాలు గూడా రావడం లేదు కదమ్మా? నువ్వూ రాయడం లేదు గదూ? నా తల్లివి గదూ చెప్పమ్మా?!"

**జరిగినకథ 15**: లక్షాధికారి హనుమంత రావుగారు వివాహమాడిన బెంగాలీ యువతి గీత, ఇందిరను కనిన కొంతకాలానికి మరణిస్తుంది. ఆయన అక్క సుగుణ తన కొడుకు ఫారిన్ రిటర్న్‌డ్‌ను ఇందిరకు ఇచ్చుటకు ఆమె అత్త మామలు నిరాకరించారని ఉత్తరంలో విచారం వెలిబుచ్చుతుంది. ఇందిరను చేసుకునే విషయములో విశ్వనాథం వ్రాసిన ఉత్తరం హనుమంతరావుని గుండె పోటుకు గురిచేయగా, ఆయన కుమారుడు శ్రీకర్ వ్రాసిన ఉత్తరం ఊరట కల్గిస్తుంది. హనుమంతరావుగారు ఇందిరకి వేరే సంబంధాలు చూస్తుంటారు. అమెరికాలో ఉద్యోగం చేస్తున్న ఆనంద్‌తో ఇందిరకు ఘనంగా వివాహం జరిపిస్తారు రావుగారు. కాపురానికి కావలసిన అన్ని వస్తువులూ ఇచ్చి, ఇందిరను అత్తవారింటికి పంపుతారు. దురదృష్టవశాత్తు తుఫాను బీభత్సంలో తల్లిదండ్రులను కోల్పోయిన అల్లుడ్నీ, కూతుర్నీ తనింటికి తెస్తారు రావుగారు. ఇందిర తండ్రిని ఒంటరిగా వదిలివేసి ఆనంద్‌తో అమెరికా వెళ్తుంది. 'నాన్సీ' స్నేహితుని భార్య అని చెప్పి యిందిరను ఆమె యింటికి చేరుస్తాడు నాన్సీ, ఆనంద్‌ల ప్రవర్తనను ఏవగించుకున్న ఇందిర, వేరే ఇల్లు చూపమని శ్రీకర్‌ని అర్థిస్తుంది. నాన్సీ తన భార్యేననీ, ఇందిర ఆమెకు ఊడిగం చేయక తప్పదని చెప్పిన ఆనంద్‌ను ద్వేషించి బయటికివచ్చేస్తుంది ఇందిర. శ్రీకర్-ఇంటికి వచ్చిన ఇందిరకు, శ్రీలతతో తనకు ఎలా వివాహం జరిగిందీ వివరిస్తుంటాడు. అమెరికాలోని ఒక వ్యక్తి శ్రీలతను ప్రకటనద్వారా వివాహమాడి ఎట్లా మోసం చేసిందీ శ్రీకర్ ఇందిరకు చెప్తాడు. కంప్యూటర్ కోర్సులో చేరిన కొన్నాళ్ళకు తాను గర్భవతినని తెలుసుకొని 'అబార్షన్' చేయించుకోవాలనుకున్న ఇందిరను వారిస్తారు శ్రీకర్, శ్రీలతలు. పుట్టింటికి రమ్మని తండ్రి వ్రాసిన ఉత్తరం చూసుకొని ఎటూ తేల్చుకోలేని స్థితిలో ఉంటుంది ఇందిర. తండ్రి దగ్గరకు వచ్చిన ఇందిరకు పురుడు పోయటానికి వచ్చిన సుగుణ, కోడలి మరణ వార్తని తిరిగి వెళుతుంది. ఆనంద్, ఇందిరల మధ్య భేదాభిప్రాయాలు పసికట్టిన రావుగారు వాస్తవం తెలియ జేయమని ఇందిరను అడుగుతారు.

ఏడు నెలలతో వున్న ఇందిర కొద్దిగా నీరసంగా వుంది. ఇంక చెప్పక తప్పదేమో- అనిపించింది ఆమెకి! తండ్రి ఆ సంగతి ఎత్తగానే ఏదో ఉద్విగ్నత కలిగింది. లోపలి బాధ ఏడుపు రూపంలో బయటికొచ్చేసింది. "నాన్నా..." తండ్రి ఒళ్ళో తల దూర్చి వెక్కి వెక్కి ఏడిచింది ఆ ఒడి ఆమెకి కన్నతల్లి ఒడిలాగానే వుంది!

"నాన్న మనం మోసపోయాం నాన్నా! వంచకుడు- దగా..." అస్పష్టంగా గొణిగింది. కొంతసేపు హృదయ భారమంతా తీరేదాకా ఏడిచి-

తల పైకెత్తి "నాన్నా. నేను...నేను" అంది.

"ఏమిటమ్మా?"

"నేను చెప్పేది విని... మీరు తట్టుకో గలరా? అందుకే... అందుకే... ఆ భయంతోనే ఇన్నాళ్ళూ మీకిది ఎంత ప్రయత్నం చేసినా చెప్పలేకపోయాను. నాకు మీ ఆరోగ్యం ముఖ్యం. ఇప్పుడు నేను జీవించేది మీకోసమే- కేవలం మీకోసమే... నాన్నా" అంటే మళ్ళీ కళ్ళు నీటితో నిండి పోయాయి.

"తల్లీ..." ఆయన చలించి పోయారు. మనసు కీడుని శంకించ సాగింది.

"అవును నాన్నా! నే నిప్పుడు చెప్ప బోయేది విని- మీరు హరాయించుకోవాలి. ఆ షాక్‌కి మీరు తట్టుకోగలిగితేనే నేను మీకు చెప్పాలి. లేకపోతే చెప్పగూడదు... చెప్పగూడదు..."

"ఏమిటి తల్లీ- నీ మాటలు చిత్రంగా వున్నాయే? నువ్వు ఆ పరిస్థితిని భరించి అన్నిటికీ తట్టుకోగలిగావు. ఆడపిల్లవి నువ్వే భరించగలిగినప్పుడు- అందులో ఒంటరిగా దేశంకాని దేశంలో...? నేను...నేను...నాకు

ఆ భగవంతుడున్నాడు... చెప్పతల్లీ- నేను సిద్ధమే...!''

ఆయనకి కూతుర్ని చూస్తే ఆశ్చర్యం వేసింది. భయం వేసింది! తన చేతుల్లో తన గుండెల మీద పెరిగిన పిల్లేనా అనిపించింది!

నెమ్మదిగా చెప్పడం ప్రారంభించింది ఇందిర. చెప్పబోయే ముందున్న దుఃఖమూ -విచారమూ బేలతనమూ లేదా మెగొంతులో ఇప్పుడు! గంభీరంగా చెప్పుకు పోతున్న ఆమె గొంతులో ద్వేషం రక రకాలుగా- రంగు రంగులో నర్తించింది!

* * *

అంతా విని అన్నంత ధైర్యంగా నిలబడ లేకపోయారు రావుగారు. ఆ షాక్‌కి ఆయన పితృహృదయం తట్టుకోలేక పోయింది. ఊహించని తీవ్రాఘాతం ఇది! హఠాత్తుగా పిడుగుల వర్షం కురిస్తే ఎట్లా వుంటుందో అట్లా వుందాయన మనస్థితి! ఆవేదన, ఆవేశం, ఉద్రేకం, కసి, క్రౌర్యం, విషాదం, విచారం అన్నీ ముప్పిరి గొన్నాయాయనలో. ఎంత ప్రయత్నం చేసినా తనని తాను కంట్రోల్ చేసుకోలేక పోయారాయన!

''ఇడియట్, రాస్కెల్, దుర్మార్గుడు, వంచకుడు, వాడి అంతు చూస్తాను, వరికి పోగులు పెడతాను ... వాడికి...వాడికి ఎంత ధైర్యం! నా కూతుర్ని- నా చిట్టి తల్లిని- నాశనం చేస్తాడా? ఏవరనుకున్నాడది? అప్రాచ్యుడు - దౌర్భాగ్యుడు - భ్రష్టుడు... నా ప్రాణం- నా ప్రాణం- ఇందిర- దాన్ని- దాన్ని ఈ విధంగా బాధ పెడతాడా? ఒరేయ్... నిన్ను షూట్ చేసేస్తాను... గొయ్యితీసి పాతిపెడతాను... చిత్రవధ చేస్తాను- జైల్లోకి తోస్తాను..''

ఆయాన వడిపోతున్నారు! వళ్ళంతా చలువలు కమ్మాయి! హార్ట్ ఎటాక్ తీవ్రంగా వచ్చేసిందాయనకి! వెనక్కి విరుచుకు పడిపోయారాయన...!

ఇందిర ఏడుస్తూ కుప్పలా కూలి పోయింది! ఆమెకి నొప్పులు ప్రారంభమయ్యాయి!

పనివాళ్ళు హడావిడి పడి డాక్టరుకోసం ఒకళ్ళు- ఫోను చెయ్యడానికి ఒకళ్ళు- పరుగెత్తారు!

## 23

చాలా సీరియస్‌గా వుంది రావుగారి కండిషన్. ఆక్సిజన్ కూడా పెట్టాల్సి వచ్చింది. ఇందిరకిదేసీ తెలియదు. ఆమెని పనివాళ్ళే నర్సింగ్ హోములో చేర్చారు. ఆమె నొప్పులతో తల్లక్రిందులై పోతోంది. మూడు రోజులు గడిచాయి. రావుగారికి స్పృహలేదు. ఇందిరకి నొప్పులు ఆగలేదు -పురుడు రాలేదు. ఆమె చాలా వీక్‌గా వుంది-నొప్పులకు తట్టుకోలేక పోతోంది. సెలైన్ వాటర్ ఎక్కించారు - చివరికి మేజర్ ఆపరేషన్ చేసి బిడ్డని తియ్యాల్సి వచ్చింది. అతి ప్రయత్నం మీద ఇందిర బతికింది! మగపిల్లవాడు పుట్టాడు! ఇందిరకి ఆరోజంతా స్పృహలేదు! ఆరోజే రావుగారికి స్పృహవచ్చింది. స్పృహరాంగానే మనుమడు పుట్టాడన్న వార్త ఆయనలో ఉత్సాహాన్ని కలిగజేసింది. ఆ వెంటనే ఆయన ముఖం విచారంతో నిండిపోయింది.

''ఇందిర ఎట్లావుంది?'' అడిగారు.

''ఇందిర కులాసాగానే వుంది!''

ఈ వార్త విని సంతోషించారు.

''కాని- కాని- వాడికి తండ్రి ... తండ్రి...'' అని రెండు చేతుల్తో ముఖాన్ని కప్పుకుని ఏడవసాగారు.

''మీరీ సమయంలో ఉద్రేక పడకూడదు. మీరే తాత- తండ్రి అన్నీ వాడికి - మీరు ధైర్యంగా వుండాలి ...'' డాక్టర్లు నచ్చజెప్పారు. ఆయనల్లుడికి ఏదో అయిందనుకున్నారు వాళ్ళు! ''మీ మనవడి కోసమున్నా మీరు త్వరగా కోలుకోవాలి...'' అన్నారు.

''కాదయ్యా- నా బాధ మీకు అర్థం కాదు. పిచ్చితల్లి! దానికి పండంటి జీవితమంతా ముందే వుంది. నూరేళ్ళ జీవితం ముందే వుంది, అంతా ఇట్లాగే గడపాల్సిం



# రాగద్వేషాలు

దేనా? అది! దీనికి కారణం వివరనుకున్నారు? నేను? నేనే ఆ దుర్మార్గుణ్ని. దాని జీవితం నాశనం చేసిన వాడిని నేనే! 'దూరపు కొండలు నునుపు' అనుకుంటూ— పెళ్ళి అంత దూరాన వున్న సంబంధాన్ని చేశాను. అది కనీసం మూడు నెలలన్నా హాయిగా బతకలేదు. అంతకంటే—అంతకంటే వాడు చచ్చిపోయినా నా ఇందుకి ఇంకో పెళ్ళి చేసే వాడ్ని. ఏడ్చి వూరుకుని వుండేవాడ్ని! ఇప్పుడు— ఇప్పుడు దాని బాధని చూస్తూ—

పాపం నా తల్లి అక్కడ ఎన్ని బాధలు పడ్డదో! చెప్తుంటేనే నాకు వినడానికి భయం వేసింది. వింటూ భరించలేక పోయాను. ఆ కసాయివాడి ప్రవర్తనకి అదెంత బాధపడి— క్రుంగి కృశించిందో... నా తల్లిని నేను. ఎట్లా— ఎట్లా పెంచాను? అబ్బా... ఈ బాధ నేను భరించలేను...?" ఎంత వారించినా ఆయన మాట్లాడుతూనే వున్నారు. కుమిలిపోతూనే వున్నారు. మళ్ళీ స్పృహ తప్పిందాయనకి. !

*       *       *

"అమ్మా ఇందూ— నీ కన్యాయం చేశానే తల్లీ! అనాల్సింది వాడిని కాదు— నన్ను! నేనే దీని కంతటికీ మూల కారణం! ఎక్కడా సంబంధాలే లేనట్లు అమెరికాలో వున్న ఈ అడ్డగాడిదని— ఈ వెధవని నీకు కట్టాను. నా చాదస్తం— అవును నా చాదస్తమే— తెలుగువాళ్ళే కావాలి— బ్రాహ్మలే కావాలంటూ నీ బతుకుని నాశనం చేశాను. పేపర్ ప్రకటన చూసి ఎంత మోసపోయాం! ఆడపిల్లల తల్లిదండ్రులారా! నన్ను చూసి బుద్ధి తెచ్చుకోండి! మీ పిల్లల గొంతులు ఈ విధంగా కొయ్యకండి! వాళ్ళ జీవితాలు చేతులారా నాశనం చెయ్యకండి. వాళ్ళకి వచ్చిన వాళ్ళతోనే పెళ్ళిళ్ళు జరిపించండి—" స్పృహలో లేకుండా గూడా ఆయన ఇవే కలవరింతలు! డాక్టర్లు గూడా భయపడి పోసాగారు! ఆయన ప్రాణం నిలపలేమేమోనని!

*       *       *

"నాన్న కెట్లావుంది?" ఇందిర స్పృహ రాగానే మొదటి ప్రశ్న అది!

"మీ నాన్నగారు కులాసాగా వున్నారమ్మా! మీ అబ్బాయిని చూసుకున్నారా?" ఎత్తుకొచ్చి చూపించింది నర్సు!

నిర్లిప్తంగా చూస్తూండి పోయింది. నర్సు అందిస్తే యాంత్రికంగా అందుకుంది బిడ్డని! తను 'తల్లి' అయింది! స్త్రీలంతా అపురూపంగా కోరుకునే వరం— మాతృత్వం!

తనకి అక్కరలేదు అనుకున్నా లభించింది! పరస్పరానురాగం కలిగిన భార్యాభర్తలు—తమ తొలి వలపు పంటను చూసి మురిసిపోయే తరుణం— తన కెట్లాంటిది ? మొదట వద్దనుకుంటూనే భరించింది వాడ్ని! తొమ్మిది నెలలూ మోసింది ...కన్నది! ఏ అనుభూతులూ లేవు ! ఎంత దురదృష్టవంతురాలు తను ! వాడెంత దురదృష్టవంతుడు ! తనకు తల్లి లేనేలేదు ! భర్త సరేసరి ! ఆ విధంగా వాడికీ తండ్రి ప్రేమ శూన్యం ! తన తండ్రి కూడా ఇప్పుడు తన కానందమేమన్నా వుంటే దాంట్లో పాలు పంచుకునే స్థితిలో లేడు ! తను తప్పు చేసింది-చాలా పెద్ద తప్పు చేసింది— నాన్న కసలు చెప్పకుండా వుండాల్సింది ! దానివల్ల తండ్రి కూడా తనకి దూరం కాడు గదా ! తండ్రి తనకు కరువవుతే వీడిని తానెట్లా పెంచగలదు ? డబ్బొకటే వుంటే చాలా ? "డబ్బుకోసం చేరే రాబందుల్ని తప్పించుకుంటూ తనీ ప్రపంచంలో బతకగలదా ?"

"చూడమ్మా — బాలింతరాలివి ! మరీ అంతగా ఆలోచించి వర్రీ కాకూడదు. ఏం ఫరవాలేదు. అన్నీ సవ్యంగా జరిగిపోతాయి ! ధైర్యంగా వుండు. నువ్వీపరిస్థితిలో కన్నీరు అసలు నించ గూడదు !" డాక్టర్ ఓదార్చి కన్నీరు తుడిచింది.

*       *       *

నెల రోజులు గడిచాయి. పిల్లవాడు బలహీనంగా వున్నాడని కొన్నాళ్ళు హాస్పిటల్లోనే వుంచుకున్నారు. ఇందిరని మాత్రం ఇంటికి పంపించారు. మరో పదిహేను రోజులకి పిల్లవాడిని పంపించారు. ఇందిర పిల్లవాడితో ఇంటికి తిరిగి వచ్చిన మరో పదిహేను రోజులకు రావుగారు ఇంటికివచ్చారు. ఇందిర కోసం పిల్లవాడికోసం ఆయన బతికి తీరాలని నిశ్చయించుకున్నారు. డాక్టర్లు చెప్పిన సలహాలన్నింటినీ పాటించారు తు.చ. తప్పకుండా! కాస్త కోలుకున్నారు! కానీ బాగా నీరసంగా వున్నారు! నిజంగా ఆయన బతుకుతారని ఎవరూ అనుకోలేదు. డాక్టర్లు స్మైతం పెదవి విరిచారు—ఒక సందర్భంలో! కానీ డాక్టర్లు పదే పదే హెచ్చరికలు చేశారు— ఆయన్ని ఇంటికి పంపిస్తూ! ఏ విధంగానూ ఆయన ఆవేశ పడకూడదు. పూర్తి విశ్రాంతి కావాలి— శారీరకంగా— మానసికంగా గూడా! ఎక్కువగా మాట్లాడ గూడదు. ఆహార నియమాల్లో గూడా జాగ్రత్తగా వుండాలి. ఇది ఇప్పటికే రెండో సారి హార్ట్ ఎటాక్ రావడం! ఎంతో జాగ్రత్తగా వుంటేగానీ లాభంలేదు!

మూడోసారి గనక వస్తే ఇంక హోప్ లేదు!అన్నిటికీసరేననితలవూపారు! మనవణ్ని చూపిన ఆయన ముఖంలో మళ్ళీ నవ్వు తొంగి చూసింది. ఎంతో ఆనందం కలిగింది. ఎన్నో తర్జన భర్జనల మీద జరిగింది మర్చిపోవడానికి నిశ్చయించుకున్నారు రావుగారు.



# మీరు కేవలం ఓ బల్బును కొనాలనుకుంటే, ధారాళంగా దేనినైనా కొనండి కాని మీరు మరింత ప్రకాశవంతమైన కాంతి, చిరకాలపు మన్నికను కొనాలనుకుంటే, హెచ్ఎమ్‌టిని కొనండి



చాలా బల్బులు ప్రకాశవంతమైన కాంతిని, మన్నికనూ ఇస్తాయి. కాని మీరు మరింత ప్రకాశవంతమైన కాంతినిస్తూ, చిరకాలం మన్నే బల్బు కావాలనుకుంటే, ఒకే ఒక బల్బు ఉంది — హెచ్ఎమ్‌టి.

కాని హెచ్ఎమ్‌టి బల్బులు మరింత ప్రకాశవంతంగా కాంతి నిచ్చేందుకు, చిరకాలం మన్నేందుకు కారణం ఏమిటి? ఇతర ఉత్పాదకులకన్నా హెచ్ఎమ్‌టి కొన్ని ఉత్కృష్టమైన లాభాలను కలిగివుంది. హెచ్ఎమ్‌టి మాత్రమే, తమంతట తామే, బల్బు యొక్క అన్ని భాగాలను తయారు చేసే ఏకైక సంస్థ. అందుకే ప్రతి దశలోనూ నాణ్యతను అదుపులో ఉంచేందుకు హెచ్ఎమ్‌టికి వీలౌతుందన్న మాట.

ఇంకా, హెచ్ఎమ్‌టి వారు బల్బులు తయారుచేయటం ప్రారంభించక ముందే వారు బల్బులు తయారుచేసే యంత్రాలను తయారుచేస్తూ వస్తున్నారు. అందువలన కేవలం సాధారణ బల్బులు కాక విశిష్టమైన, ఉత్తమమైన బల్బులు తయారుచేసే సాంకేతిక పరిజ్ఞానపు ఆధిక్యతను హెచ్ఎమ్‌టి కలిగివుంది.

అంతేకాదు, హెచ్ఎమ్‌టి వారు టంగ్‌స్రామ్ వారి— అంటే ప్రపంచంలో ల్యాంపులు తయారుచేయడంలో అత్యంత అనుభవం కలిగిన ఒకానొక విశిష్ట సంస్థ— అనుభవం, విజ్ఞానం కలిగివున్నారు. ఇది హెచ్ఎమ్‌టి బల్బులకు అంతర్జాతీయ నాణ్యతనిస్తుంది.

ఇంకా, హెచ్ఎమ్‌టి వారికి, వారి గడియారాలు, యంత్ర పరికరాలు మరియు ట్రాక్టర్లు తయారుచేయడంలో 25 ఏళ్ళుగా సంపాదించిన ఖ్యాతి వుంది. మరి ఆ ఖ్యాతినంతా వారు, ఈ గాజు ముక్కపై సూటిగా ఒడ్డుతున్నారంటే ఏదో వుందన్న మాటే మరి. ఆ వుంది మరి. మరింత ప్రకాశవంతమైన కాంతి, చిరకాలపు మన్నిక, ఇంకా ఉత్తమమైన నాణ్యత.

hmt



## హెచ్ఎమ్‌టి బల్బులు - మీ జీవితంలో వెలుగులు

Rediffusion/H/748 TL c

దేవుడే ఆనంద్‌కి తగిన శిక్ష వేస్తాడని అనుకున్నారు! కనీసం కూతురి కోసమయినా మర్చిపోవాలనుకున్నారు. బాబుకి మూడోనెల వచ్చింది. ఎక్కువ హడావిడి లేకుండా ఒక పదిమందిని పిల్చి పుణ్యావచనం – బాలసారె జరిపించారు. మనవడికి 'శ్రీనివాస్' అని పేరు పెట్టుకున్నారు. కానీ ఇందిర్ని చూస్తున్నకొద్దీ ఆయనలో బాధ పునరావృత్త మవుతూనే వుంది. ఏంచేసి తీర్చగలడు–తను ఆమె బాధని ?

పాపం తనుచెప్పిన వాటన్నిటికీ ఒప్పుకుని తనతో సహకరించి తను కుదిర్చిన వాణ్ణే చేసుకుంది! తనంతట తాను ఎవరినన్నా చేసుకున్నా బావుండేదేమో ?

తనే ద్రోహం చేశాడు! కన్న కూతురికి తనస్వార్థం కోసం ద్రోహం చేశాడు. తను అన్యకులస్థురాలిని పెళ్ళి చేసుకుని తన వారితో విడిపోయి– మళ్ళీ ఆ ప్రాంతంలో కలవాలని–తన స్వార్థం కోసం– బంగారం లాంటి దాని బ్రతుకుని నాశనం చేశాడు. మళ్ళీ ఏంచేస్తే దారి కొస్తుంది – దాని బతుకు ? ఇందిర తల్లి బతికి వుంటే ఇట్లా జరిగేదా? జరగనిచ్చేదా? ఏం చేసేది? ఆలోచనలు వదలడం లేదాయనని!

అట్లా ఆయన ఆలోచిస్తూ బాధపడుతూ కూచుంటే ఇందిర పిల్లవాడితో వచ్చి ఎదురుగ్గా కూర్చునేది తండ్రికి! పిల్లవాడి బోసి నవ్వులు చూస్తే ఇద్దరూ మైమరచి పోయేవారు! ఆనందాబ్ధిలో ఓలలాడేవారు.

శ్రీనివాస్‌కి మూడు నెలలు నిండాయి.

## రాగద్వేషాలు

మనుషుల మొహాల్ని చూసి నవ్వుతున్నాడు–వాడు. చక్కటి ఉయ్యాల ఏర్పాటు చేశారు–వాడు పడుకోడానికి. నగిషీలు చెక్కబడిన నల్లచెక్క ఉయ్యాల చాలా అందంగా వుంది. లోపల చిన్న పరుపు, చిన్న చిన్న దిండ్లు వున్నాయి. దానికి పైన బొమ్మలు, గిలక్కాయలు వేలాడ కట్టడానికి పందిరి వుంది. దోమతెర అమర్చడానికికూడా వసతి వుంది దానికి. ప్రత్యేకంగా ఆర్డర్ ఇచ్చి మనవడి కోసం చేయించారది రావుగారు.

రంగు రంగుల బొమ్మల్ని చూస్తూ– గిర్రున తిరిగే గిలక్కాయలు– చిలకల్ని చూస్తూ ఆడుకుండేవాడు పసివాడు.

రావుగారు ఒక్క క్షణం కూడా వాడ్ని వదలకుండా అంటిపెట్టుకునే వుంటున్నారు. ఆయన పూర్తి విశ్రాంతి తీసుకుంటున్నారు. నాలుగు– అయిదు నెలల్లో బాబు బోర్లా పడడం– పొట్టతో ముందుకు పాకడం నేర్చుకున్నాడు.

అప్పుడప్పుడూ ఉయ్యాల్లోగాకుండా నేల మీద చాప వేసి పడుకోబెట్టేవారు! వాడు ఆడే ప్రతి ఆటా–వాళ్ళకి కన్నుల పండుగా వుండేది. ఆరు ఏడు నెలలు వచ్చేసరికి పారాడడం · కూర్చోడం– వచ్చింది– వాడికి. పళ్ళు రావడం ప్రారంభించాయి! పళ్ళు వచ్చేటప్పుడు కాస్త నలత చేస్తే బెంగపడి పోయారు తండ్రీ– కూతుర్లూను! డాక్టర్ చుట్టూ తిరుగుతూనే వున్నారు. పిల్లవాడు వాళ్ళ ప్రాణమైపోయాడు. 'తాత' అని శ్రీనివాస్ అనడం విన్నరోజున రావుగారు ఆనందంతో ఉప్పొంగి పోయారు. తన జన్మ ధన్యమయినట్టే భావించారు అప్పటికప్పుడు స్వయంగా బజారెళ్ళి– ఎన్నో కానుకలు కొని తెచ్చారు మనవడికి. అప్పటికే వాడికి లేని వస్తువంటూ లేదు. మూడు చక్రాల సైకిలు ముందే కొనిపించారు. ఒకచక్కని కారు తొక్కితే నడిచేది, ఊగే గుర్రం, కీ ఇస్తే పట్టాల మీద నడిచే రైలు ఇంక బొమ్మలకి లెక్కేలేదు. బేబీ పౌడరు– బేబీ సోపు– వగైరాలు పుట్టినప్పటి నించీ వున్నాయి వాడికి! నగలు రక రకాలుగా చేయించారు. ఆడపిల్లలకి చేయించే నగలన్నీ శ్రీనివాస్‌కి చేయించారు. అవన్నీవేసి అలంకరిస్తే అచ్చు ఆడపిల్లలాగే వుండేవాడు! పచ్చని శరీరఛాయ, కను ముక్కు పోలికలు ఇందిరవి. ఉంగరాల జుట్టు, నడక, నవ్వు ఆనంద్‌ని వచ్చాయి శ్రీనివాస్‌కి !

గుర్రంమీద కూచోబెట్టి ఊపేవారు– సైకిలుమీదా, కారుమీదా కూచోబెట్టి తిప్పేవారు రావుగారు స్వయంగా. చప్పట్లు కొడుతూ అర్థంకాని భాషలో ఏదేదో మాట్లాడేవాడు శ్రీనివాస్– తాతగారిని చూస్తే !

మంచి 'ప్రామ్' కూడాకొన్నారు– రావుగారు వాడి తొమ్మిదో నెలన. చాలా అందంగా వుందది. బాబుకి పట్టుకోని నుంచోడం వచ్చింది. బొద్దుగా ముద్దుగా

వుండే బాబుని చూసి చూసి మురిసిపోయే వాళ్ళు రావుగారు, ఇందిరా గూడా!

రకరకాలుగా రంగుల ఫోటోలు తీయించారు వాడికి! శేఖర్ వాళ్లకి పంపించింది ఇందిర వాడి ఫోటోలలో కొన్నింటిని! వాళ్లే కదా—తన ఈ ఆనందానికి మూల కారకులు! లేకపోతే తనీ పెన్నిధిని పోగొట్టుకుని వుండేదే! వాళ్లకి తను ఎప్పటికీ కృతజ్ఞురాలే!

ఇందిరని వంటరిగా వుండనిచ్చేవారు కాదు రావుగారు. ఇందిర ఆలోచిస్తున్నట్లు తోస్తే చాలు బాబుని వళ్లో కూర్చోబెట్టేవారు. దాంతో అన్నీ మర్చిపోయేది ఇందిర! బాబుకి పట్టుకోకుండా నించోడం, తప్పటడుగులు వేయడం వచ్చింది. కుర్చీలు, బల్లలు ఎక్కడం నేర్చుకుంటున్నాడు! ఆ ఎక్కి దిగడంలో ఎన్నోసార్లు కిందపడ్డాడు! పడ్డప్పుడల్లా చాలా కంగారు పడేవారు ఇందిరా, రావుగారూను!

ఇందిర అప్పుడప్పుడూ ఏడ్చేసేదికూడా! ఒకచోట నిలవడంలేదు బాబు— ఇల్లంతా ఏకం చేస్తున్నాడు. ప్రతివస్తువూ సవరిస్తున్నాడు. చాలా వస్తువులు వాడి చేతిలో పాడయ్యాయి! ఎన్నో విలువయిన వస్తువులు బద్దలయ్యాయి! గ్లాసులు — సీసాలు పగిలిపోయాయి! ఒకసారి ఎవరూ చూడనప్పుడు కత్తితో వేలు కోసుకున్నాడు, నిప్పు ముట్టుకోబోయాడు, తాతగారి మందుసీసాల మూతలు తీసి తాగబోయాడు, ఆయింటుమెంట్లు ఒళ్లంతా పూసుకున్నాడు. నీళ్లతో ఒకటే ఆట—పంపుతిప్పి దానికింద కూచునేవాడు— తల-వళ్లూ తడిసిపోయేవి—వెంటనే జలుబు చేసేది— చెప్పులతో ఎక్కువ ఆట వాడికి—ఇట్లా ఎన్నో అల్లరి పనులు — పుస్తకాలు చింపడం—ఇంకు పారబొయ్యడం — 'పెన్నులు' పాడుచెయ్యడం — ఏంచేసినా రావుగారు వాడిని-ఏమీ అనేవారు కాదు — ఇందిరని అననిచ్చేవారు కాదు! పైగా ముద్దులాడేవారు! తనే స్వయంగా ఆ వస్తువులన్నీ తీసి జాగ్రత్త చేసేవారు. ఏడాదికే బాగా మాట్లాడడం వచ్చింది వాడికి! చిట్టి చిట్టి అడుగులతో నడుస్తూ—అల్లి బిల్లి మాటలతో మాట్లాడుతూ—తల్లికీ— తాతగారికీ ఆనందాన్నికూర్చేవాడు. "అమ్మా" అని వాడు తనని పిలిచినప్పుడు ఇందిరకి ఆనందంతో ఏడుపు వచ్చేసింది! ముద్దుల్లో ముంచేసింది వాణ్ణి!

పుట్టినరోజు వైభవంగా జరిగింది! కార్డులు అచ్చు వేయించి మరీ అందర్నీ పిల్చారు రావుగారు ఇందిర పుట్టినరోజులు ఘనంగా జరిపేవారు ఒకప్పుడు! ఇప్పుడు శ్రీనివాస్ పుట్టినరోజు దాన్ని మించిచేశారు! వాడికి చిన్న చిన్న పద్యాలు నేర్పించడం మొదలు పెట్టారు. చిన్న చిన్న కథలు వాడికి అర్థమయేటట్లు చెప్తూ వుండేవారు.

అవన్నీ ఇందిర కూడా ఎంతో ఆసక్తిగా వింటూ వుండేది. వాడికి కథలు చెప్తున్నప్పుడు రావుగారు ఇందిర చిన్నతనాన్ని గురించిచెప్పేవారు ఇందరతో. ఎప్పటెప్పటి సంగతులో చెప్పేవారు!

ప్రఫుల్ల వదనంతో చెప్తున్నవారు కాస్తా ఇందిర తల్లి ప్రస్తావన వచ్చేసరికి విచారంగా మారిపోయేవారు!

ఆ సమయంలో ఇందిరకి అప్రయత్నంగానే ఆనంద్ గుర్తుకొచ్చేవాడు! వెంటనే ద్వేషం — జుగుప్సలతో హృదయం ముడుచుకుపోయేది!

ఇద్దరూ మళ్ళీ బాబు ముద్దు-ముద్దు పలుకులతో ఈ లోకంలోకి వచ్చేవాళ్ళు! బాబుకి ముద్దుగా — ముచ్చటగా మూడు పుట్టినరోజులు గడిచాయి!

ఈ మూడేళ్ళలో రావుగారి మాజుగరు కూడా గతించారు.

బాబు మూడో పుట్టినరోజు అయ్యాక —బాబుని మాంటిస్సోరి స్కూల్లో చేర్చారు. బాబు స్కూలుకి వెళ్తున్నప్పటి నించీ — ఇందిరకీ—రావుగారికీ కూడా ఏమీ తోచడం లేదు!

## 24

సాయంత్రం ఫ్యాక్టరీనించి తిరిగివచ్చారు రావుగారు. "సీను— బాబూ —" రాగానే పిలిచారు. పరుగెత్తుకొచ్చి తాతగారి కాళ్లని చుట్టుకుపోయాడు బాబు

చక్కగా రెడీఅయి వున్నాడు. బ్లాకలర్ నిక్కర్ - ఆదేరంగు షర్టూ! చక్రాల్లాంటి కళ్ళు తిప్పుతూ "తాతయ్యా- మరే... మా టీచరు నాకు కొత్త పద్యం చెప్పింది..." అన్నాడు.

రెండు బుగ్గలూ ముద్దు పెట్టుకుంటూ "అట్లాగా ? ఏదీచెప్పు...?" అన్నారు.

"బా—బా—బ్లాక్ షీప్—
హౌవ్ యూ ఎనీ వూల్ ?..."
చెప్పడం మొదలు పెట్టాడు.

యాక్షన్‌తో సహా చెప్తున్నాడు వాడు! నవ్వుతూ తిలకిస్తున్నారు రావుగారు మనవణ్ని!

ఇందిర కాఫీ తీసుకొచ్చింది. ఆమె

ఆ ఆరొందల రూపాయలు కనబడ్డం లేదనేగా మీ దిగులు?!



ముహం సంతోషంతో వెలిగిపోతోంది! కాఫీ ఇస్తూ "నాన్నా- మీకో శుభవార్త!" అంది చిన్న పిల లాగా!

చిన్నాళ్ళయింది ఇందిర ముఖంలో ఇట్లాంటి నవ్వు చూసి! ఆ క్షణంలో ఇందిర ఆయన కళ్ళకి చిన్న పిల్లలాగే కనిపించింది. పెళ్ళి కాక



# రాగద్వేషాలు

ముందు ఎగురుతూ - గెంతుతూ - కులాకీగా పుత్సాహంగా వుండే ఇందు తల్లే ఇప్పుడు తన కళ్ళముందు కదలాడుతున్నట్లుంది!

"ఏమిటి తల్లీ అది?" తలమీద చెయ్యేస్తూ అడిగారు చిఱునవ్వుతో!

"శ్రీకర్ - శ్రీలత ఇండియా వస్తున్నారట నాన్నా! వచ్చే నెల్లోనే వస్తున్నారు. ముందు ఇక్కడికే వస్తారుట! ఇంకో మాట కూడా వాళ్ళు అమెరికా వదిలేస్తున్నారట! ఇక్కడే ఎవరితోనైనా కలిసి ఇండస్ట్రీ ఒకటి స్టార్టు చేద్దామనుకుంటున్నాడుట - శ్రీకర్..." ఉత్సాహంగా చెప్పుకుపోతోంది ఇందిర!

ఇందిర శ్రీకర్ తనని చూసి వెళ్ళిన మొదటి పెళ్ళికొడుకని తండ్రికి చెప్పలేదు చెప్పే అవసరమూ రాలేదు.

కన్నార్పకుండా కూతుర్నే చూస్తున్నారాయన!

జీవితంలో సర్వస్వమూ - అయిన భర్త ప్రేమని పోగొట్టుకుని - అతడిచే తీవ్రంగా వంచింపబడిన ఈ అభాగ్యురాలికి - ఇంక ఇట్లాంటివేనా సంతోష క్షణాలు? ఆయన గుండె జాలితో నిండిపోయింది. శ్రీకర్ - శ్రీలతల ప్రసక్తి వచ్చినప్పుడల్లా - సంతోషమూ - కృతజ్ఞతా భావనా మెరుస్తాయి ఇందిర కళ్ళల్లో!

"నాన్నా శ్రీకర్ శ్రీలతలు నాకేమౌతారో తెల్సా? తోబుట్టువు లనమంటావా? ఉహూఁ! అంతకంటే ఎక్కువ! తోబుట్టువు లంటే మళ్ళీ వాళ్ళని స్వార్థంతో కొలిచినట్లవుతుంది! స్వార్థంతో కొలవదగిన మనుషులు కారు వాళ్ళు! వాళ్ళు నాకు స్నేహితులే - అవును. ఆత్మీయులైన ప్రాణ స్నేహితులు - మంచితనం మూర్తీభవించిన సన్నిహితులు..." ఇట్లా చెప్పుకుపోతోంది పరవశత్వంతో!

"ఏది తల్లీ ఉత్తరం?" అడిగారు రావుగారు. బాబు రివ్వున పరుగెత్తుకు వెళ్ళి ఉత్తరం తెచ్చాడు. తాతగారికిచ్చాడు.

(ఇంకా ఉంది)




**వి. ఆర్. ఆర్. — కలకత్తా**

మానవునికి మంచిగాని చెడుగాని ఎలా కలుగుతుంది?

★ జన్మాంతర పాప పుణ్యాల ఫలితంగ అనవచ్చు కాని- ఈ రోజుల్లో ఆ మాటలకి అర్థం లేదు- మనం ఎదుటి వాడికి తలపెట్టే- మంచి చెడులకి అద్దమే- మనకు జరిగే మంచి చెడులు.

**కె. ఎస్. — మచిలీపట్నం**

ఈనాడు సంఘంలో ఒకవ్యక్తికి రెండవ భార్యగా లేక మరే విధముగానో చలామణీ అవుతున్న స్త్రీలలో హెచ్చుసంఖ్య ఉద్యోగినులు ప్రొఫెషనల్ ఆర్టిస్టులు కనబడుతున్నారంటే- మన స్త్రీ జాతికి కల విజ్ఞానానికిది నిదర్శన కాదా, దీనిపై స్త్రీ జనాభ్యుదయ సంఘం సర్వే జరిపితే మంచిది కదా?

★ నిజమే- ఉద్యోగినులు - మోసగింపబడో ప్రేమలో పడో ప్రొఫెషనల్ ఆర్టిస్టులు- ఆయా రంగాలలో పైకి తెస్తామన్న వారిని నమ్మో, నమ్మకో యిలాంటి చట్టసమ్మతంగాని భార్యామణులుగా చెలామణీ అవుతున్నారు కాని కంచే చేను మేసినట్టు మన స్త్రీ శిశు సంక్షేమ శాఖామంత్రి వ్యవహారం- ఎంత గడబిడ కల్పించిందో చూశారు కదా? వీరేనా? పరిశీలనలు జరిపించి స్త్రీల మంచి చెడ్డలను చూసేది?!

**జి. వి. జె. — కుర్నాడోడ్డు**

రచయితగా కె. రామలక్ష్మి అనిచెప్పుకున్నారు. మిమ్మల్ని మీరు పరిచయంచేసుకునేటప్పుడు ఆ పురుషత్వాన్నె కోరుకోరేరెందుకు? రచయిత్రిగా అని అంటే మీ పరువుకి లోపం వచ్చేదేమిటి?

★ ఏంలేదు! రచనకి స్త్రీ పురుష భేదం లేదు. రాసే వారికి వుంది. అంచేత రచన. రచయిత అంటే, దోషంలేదు- (అయినా చాలామంది మగ వాళ్ళు "త్రి"గా చెలామణీ అవుతుంటే- మన కెందుకు వారితో పోటీ అని ఎప్పుడూ- రచయితే వాడతాన్నేను!)

**టి. ఎస్. ఎస్. ఎమ్. — కరీంనగర్**

మీసమున్నా రోషమున్నా ఆడది ఆడదే చిన్నదానా? మీరే మంటారు?

★ నిజమేకొందరబ్బాయిలమీసాలుచూస్తూంటే. మీసమున్నా రోషమున్నా - ఒకచే వారికి- అని వినూ్తంటుంది! రొయ్యకు లేవా జానెడేసి మీసాలు. పౌరుషానికి మీసానికి సంబంధంలేదు రోషానికీ మీసానికీ అస్సలు సంబంధంలేదు. ఉన్న సంబంధ బాంధవ్యాలల్లా- స్త్రీ పురుషుల మధ్యనే. అంచేత- మీసమున్నంత మాత్రాన మీరు గొప్ప కాదు; పిల్లల్ని కన్నంత మాత్రాన ఆడది తీసికట్టు కాదు! ఇది తెలుసుకుంటే చాలు - హాయిగా బ్రతకడానికి.

**ఎమ్. ఎస్. ఎన్. పి. — ఏలూరు**

అబలలుగా పిలవబడే నారీమణులు ఆత్మరక్షణ కోసం ఓ పొట్టేలును పెంచుకుంటే సరిపోదా?

★ అంతకంటే రెండు కరాటే పట్లు నేర్చుకోడం సులభమని యీనాటి కాలేజీ అమ్మాయికి తెలుసు! ఈ మధ్య ఓ అమ్మాయి ఏం చేసిందో విన్నారా? రోజూ తనని దారికాని పోలో అయి అల్లరి చేస్తున్న ఓ కుర్రాణ్ణి చాలా కాలం భరించి వూరుకుందిట. ఆ వూరుకోవడాన్ని చేతకాని తనంగా భావించి ఓ రోజు కాస్త అతి చనువు ప్రదర్శించబోయేసరికి- రెండు దెబ్బల్లో నేల కరిపించిందట. అంతటితో వూరుకోక చుట్టూ మూగిన వాళ్ళు ఎంత చెప్పినా వినక అపర మహిషాసుర మర్దనిలాగా అతగాని గుండెలపై కాలు వేసి నిలబడి- "చేవుంటే నాతో పోరాడి గెలవమనండి పెళ్ళాడుతాను; లేదా క్షమించమని అడగమనండి- క్షమిస్తాను" అనేసరికి ఆ కుర్రాడు క్షమించమని, బ్రతుకు జీవుడా అని పారిపోయాట్ట.

**వి. ఎమ్. ఆర్. — హైదరాబాదు**

చదువుకో, చదువుకో అంటారేగాని దానివల్ల నాకేం ప్రయోజనం కనబడ్డంలేదు. ఏమంటారు?

★ ఏమీ అనలేను. కాని, "దీపంవెలిగించాలి- చీకటి దానంతట అదే తొలగిపోయింది"- అని మాత్రం చెప్ప కలను. చదువు ప్రయోజనం అక్షరాలు రావడం, పేర్లచివర అక్షరాలు చేర్చడం కాదు; చీకటి తొలగించుకోడం, వెలుగులో ప్రయాణించడం కూడా. దీనికి అడా మగా తేడా లేదు.

**కె. జి. హెచ్. — కుప్పం**

ఈ మధ్య మగవాళ్ళు జుట్టు మరీ పొడుగ్గా పెంచుకున్నారు.

★ ఆడవాళ్ళు పొట్టి జుట్టు ఫాషన్ చేశారు కదు! అందుకని.

**ఎమ్. ఎమ్. — విజయవాడ**

"వెన్నెముక లేని మనుషులంటే నాకసహ్యం" అనే మీ మాట నాకెంతో యిష్టం. ధైర్యంగా దూసుకుపోయే మీ మాటలు చేతలు పట్ల నాకు గౌరవముంది.

★ థ్యాంక్యూ సర్! సేదరించలేనిది యింకొకటి కూడా వుంది- హిపోక్రసీ; నమ్మకద్రోహం. జీవితంలో స్నేహానికి విలువ లేకుండా చేసేవి యివే.

**కబీర్ — వేమగిరి**

ఉట్టికెక్కలేనమ్మ స్వర్గాని కెగిరినట్లు ముందు మీ ఆడవారిసంగతి చూడండి. మాకు ఆ రావడందేనికి?

★ ఉలేవారే! స్వర్గంఅరచేత ఎలాగాచూపిస్తారు యీ మగవారు! ఉట్టికేనా ఎగరడం నేర్వమనే నేనుచెవినిల్లుకట్టుకుని పోరుతున్నాను! గ్రహించనే లేదా?!

## డాక్టర్ జ్యోతిర్మయి



శ్రీమతి జ్యోతిర్మయి, యు. జి. సి - ఫెలోషిప్‌తో తెలుగులో పరిశోధన జరిపి, మదరాసు విశ్వవిద్యాలయము నుండి ఇటీవలనే పిహెచ్. డి. పట్టము పొందిన ప్రథమ మహిళ. 'వసు చరిత్రము - ధ్వని శ్లేషల పరిశీలనము' అన్నది వీరి సిద్ధాంత గ్రంథము. బి. ఏ., ఎం. ఏ., పరీక్షలలో ప్రథమస్థానం వహించి స్వర్ణపతకాలు పొందారు. సంస్కృతంలో కూడా డిప్లొమా పొందారు. సాహిత్య సమావేశాలలో పాల్గొనడం, పద్య, గేయ రచనలు చేయడం సరదా. ఆకాశవాణి మదరాసు కేంద్రము నుండి స్వీయకవితా పఠనం, అనేక ప్రసంగాలు చేశారు. సాహిత్య సేవలో ఈమెకి ప్రోత్సాహం ఇచ్చే శ్రీ కిళాంబి కృష్ణకుమార్‌గారి సతీమణి. సుప్రసిద్ధ న్యాయవాదులు, సాహిత్యాభిలాషులు శ్రీమాన్ వింజమూరి రంగాచార్యుల వారి పౌత్రి. ప్రస్తుతం హైదరాబాద్‌లో తెలుగు లెక్చరర్‌గా పని చేస్తున్నారు.

[ ఒ. వి ]

మున్నా భారతి

# రేఖ



సమయం సాయంత్రం అయిదు గంటలయింది. ఆరు బయట లాన్‌లో కూర్చుంది రేఖ.

చల్లని గాలికి లాన్‌లో ఉన్న రకరకాల పూలచెట్లు గర్వంగా తల ఊపుతూ తమ సుగంధాలను నలువైపులా వెదజల్లు తున్నాయి. సీతాలు, రాముడూ లాన్‌లోని మొక్కలకు పాదులు తవ్వి నీళ్ళు కడు తున్నారు. వాళ్ళ మూడేళ్ళపాప, తల్లి తండ్రులు చేస్తున్న పనులను ఆశ్చర్యంగా చూస్తూ, అటూ, ఇటూ తిరుగుతోంది. రేఖ, వాళ్ళనే తదేకంగా చూస్తూ కూర్చుంది. సీతాలూ రాముడూ భార్యా, భర్తలు. సీతాలు రేఖా వాళ్ళింట్లో వంట చేస్తుంది. రాముడు, తోట పనీ బజారు పనులూ చూస్తాడు. ఆ పాప రాముడికి పుట్టిన పాప కాదు. మొదట, సీతాల్ని మేనమామ కిచ్చి పెళ్ళి చేసారుట. సీతాలుకు పాప పుట్టిన రెండు నెలలకు, సీతాలు మామ చచ్చిపోయాడు. తరువాత సీతాల్ని, బిడ్డతో బాటు రాముడు తెచ్చుకున్నాడు. తన బిడ్డ కాకపోయినా, సీతాలు బిడ్డను కన్న తండ్రిలా చూస్తూ సీతాలుతో ఎంతో అన్యోన్యంగా ఉంటాడు రాముడు. సీతాలు కుటుంబాన్ని చూస్తున్న కొద్దీ, తనవినాద తనకే జారిపేస్తున్నది-పాత సంఘటనలే మనస్సులో మెదిలాయి రేఖకి!

* * *

ఉదయం తొమ్మిది గంటలకు ఆఫీసుకు వెళ్ళిన రేఖ భర్త రవి, స్నేహితుణ్ణి వెంట బెట్టుకుని, వెళ్ళిన అర్ధ గంటకు ఆఫీసు నుంచి ఇంటికి వచ్చాడు.

"రేఖా! ఇతను నా స్నేహితుడు. పేరు వేణు. మే మిద్దరం, రెండు సంవత్సరాలు, హైదరాబాదులో ఒక ఆఫీసులోనే పని చేసాము. ఇప్పుడు ట్రాన్స్‌ఫర్ మీద ఇక్కడకు వచ్చాడు." అంటూ, వేణుని రేఖకు పరిచయం చేసాడు రవి.

"నమస్కారమండీ!" అంటూ, వేణూ వైపు చూసిన రేఖ కరెంటు షాక్ తిన్న దానిలా, బొమ్మలా అతన్ని చూస్తూ అలాగే నిల్చుండిపోయింది. రేఖను చూసిన, వేణూ పరిస్థితి అలాగే ఉంది. వాళ్ళిద్దర్నీ మార్చి, మార్చి చూస్తున్నాడు రవి. అది గమనించిన రేఖ, తన ముఖంలో చెలరేగు తున్న భావాలను పైకి కన్పించనీయకుండా జాగ్రత్త పడుతూ, "కూర్చోండి! కాఫీ తెస్తాను" అంటూ అక్కడ నిలవలేక వంట గదివైపు వెళ్ళింది.

పనిమనిషితో కాఫీలు పంపించి, బయ టకు రాకుండా వంట ప్రయత్నం చేస్తు న్నట్టుగా వంటగదిలోనే ఉండిపోయింది రేఖ.

వేణూ కూడా ఆరోజు వాళ్ళింట్లోనే భోంచేసి ఆఫీసుకు వెళ్ళిపోయాడు. రవి

ఆఫీసుకు వెళ్ళలేదు. భర్త నిదుట పడా లంటేనే భయంగా ఉంది రేఖకు.

"రేఖా! ఫోంచెయ్యలేదేం?" అంటూ వచ్చి, రేఖకు ఎదురుగా ఉన్న సోఫాలో కూర్చున్నాడు రవి.

"ఆకలిగా లేదండీ! తలనొప్పిగా ఉంది."

"రేఖా! వేణూ అంత్యక్రియమే నీకు తెలుసా?"

ఆ మాటకు సమాధానం ఏం చెప్పాలో అర్థం కాలేదు రేఖకి. ఒకవేళ, తెలియదని ఇప్పుడు అబద్ధం చెప్పినా వేణూను మాటల్లో దింపి,అసలు విషయం తెలుసుకో గల సమర్థుడు. అందుకే భర్తతో నిజం చెప్పటమే మంచిదనిపించి "తెలుసండీ!" అంది.

"తెలుసా? ఎలా తెలుసు?"

"కాలేజీలో, నా క్లాస్ మేట్."

"ఓహో! అలాగా?" వ్యంగ్యంగాఅన్నాడు రవి.

"రేఖా! అతను నీకు క్లాస్‌మేట్ అయితే చాలా రోజుల తర్వాత కనుపించినందుకు సంతోషించాలి గానీ, నువ్వు భయపడ్డా వెందుకు?"

"అతన్ని చూసి నేనెందుకు భయ పడతాను?"

"రేఖా! నువ్వు, అబద్ధం చెబుతున్నావని నాకు తెల్సు. వేణూను చూడగానే, నువ్వు జ్వరం వచ్చిన మనిషిలా వణికి పోయావు. ఏ కారణం లేకుండానే, నువ్వంతగా భయ పడ్డావంటే నేను, ఆ మాత్రం తెలుసుకో లేనంత అమాయకుణ్ణి అనుకున్నావా?" కటువుగా అన్నాడు రవి.

"ఏమండీ! నన్ను అపార్థం చేసుకోవద్దు నిజం చెబుతున్నాను. వేణూ,·నేనూ మూడు సంవత్సరాలు ఒకే కాలేజీలో చదివాము. అతను చాలా సరదాగా మాట్లాడతాడు. అతను మాట్లాడుతూ ఉంటే, టైమే తెలియదు. అతను చెప్పే తీయని మాటలు నమ్మి అతనికి మనసిచ్చాను. పెళ్ళి చేసు కుందామని నేనెంత తొందర పెట్టినా అతను ఏవో కారణాలు చెబుతూ, పెళ్ళి విషయం వాయిదా వేయటంతో, నేనే మా విషయం మా నాన్నగార్కి చెప్పాను. మా నాన్నగారు అతన్ని గురించి, వాళ్ళ ఊరు వెళ్ళి అన్ని విషయాలు తెలుసుకున్నారు. వాళ్ళమ్మగారు చావు బ్రతుకుల్లో ఉండి, తన అన్న కూతురితో, తన కొడుకు పెళ్ళి జరగాలనీ ఆ పెళ్ళి తను చూడాలని పట్టు బట్టటంతో, వేణూకు అతని మేనకోడలితో అప్పటికి నాలుగు సంవత్సరాల క్రితమే పెళ్ళి జరిగిపోయింది. ఈ విషయం, నాతో మా నాన్నగారు చెప్పగానే, నాకు అతనిమీద ఎంతో అసహ్యం కలిగింది. అతని ముఖం కూడా చూడాలనిపించలేదు. అంతలో కాలేజికి శలవులిచ్చారు. ఆ తర్వాత, మీతో నా పెళ్ళి జరిగిపోయింది.

రేఖ చెప్పిన మాటలు వినగానే రవి ముఖం కోపంతో ఎర్రబారింది.

# తేడా

"ఏమండీ! అతను మోసగాడని నమ్మి తెలియక, నేను అతనికి మనసిచ్చాను. అంతేనండీ! నా మాంగల్యంమీద ప్రమాణం చేసి చెబుతున్నాను. అతనికీ, నాకూ శారీరకంగా ఏలాంటి సంబంధమూ లేదు. అబద్ధంచెప్పి మిమ్మల్ని మోసం చేసానేమో అని అను క్షణం బాధపడేకంటే, నిజం చెప్పి మనస్సు తేలిక పరుచుకోవటం మంచిదని మీకు జరిగిందంతా చెప్పాను. ఏమండీ! మీరలా మాట్లాడకుండా ఉంటే నాకు భయమేస్తోందండీ!" ఏడుస్తూ అంది రేఖ.

"వాడిని ప్రేమించావని, నువ్వే చెబుతున్నావు. ఒకడికి మనసిచ్చి, మరొకణ్ణి పెళ్ళి చేసుకున్నదానివి నువ్వు. నువ్వు చెప్పేదంతా నిజమని నమ్మమంటావా? ఛీ! నువ్వెంతో అమాయకురాలివనీ, నువ్వు భార్యగా దొరకటం నా అదృష్టం అని ఎంతగానో పొంగిపోయాను. నా జీవితంలో ప్రవేశించి నా జీవితం అంతా నాకు మనశ్శాంతి లేకుండా చేసావు" కోపంగా అన్నాడు రవి.

"ఏమండీ! మీరు, నన్ను అపార్థం చేసుకుంటూ, మీరు బాధపడుతూ నన్ను బాధపెడుతున్నారు. పెళ్ళి కాకముందు ప్రేమించటం నేరం కాదు. ఇందులో నేను మీకు చేసిన ద్రోహం ఏముంది? ప్రమాణం చేసి చెబుతున్నాను. ఏమండీ! పెళ్ళయిన తర్వాత ఒక్కసారికూడా నాకు అతను గుర్తురాలేదు. ఏ స్త్రీ అయినా, పెళ్ళయింతర్వాత భర్తతోటిదే లోకం అనుకుంటుంది. కన్నెగా ఉన్నప్పుడు మనస్సులో ఎన్నో ఆలోచనలు రావచ్చు. కానీ, ఒకరికి భార్యఅయ్యింతర్వాత ఆ స్త్రీమనస్సు ఆ భర్తకే పరిమితం అయి ఉంటుంది" ఏడుస్తూ అంది రేఖ.

"రేఖా! నువ్వెంత నచ్చజెప్పాలని ప్రయత్నించినా, 'నేనొకడు మనసిచ్చాను' అన్న నీ మాటలే నా మనస్సులో మారుమోగుతున్నాయి. ఛీ! నీతో కాపురం చెయ్యలేను. నీ కన్నీటితో నా మనస్సును కరిగించలేవు." అంటూ, కోపంగా లేచి వెళ్ళిపోయాడు రవి.

అప్పటి నుంచి, ఏంతో అవసరం అయితే తప్ప, రేఖతో మాట్లాడటం మానేసాడు రవి. చివరకు, బెడ్‌రూములో ఉన్న మంచాలను కూడా వేరు చేసి, వేరు, వేరు గదుల్లోకి మార్చాడు.

"అమ్మగారూ! ఏమిటి? అలా గున్నారు?" అంటూ వచ్చిన సీతాలు పిలుపుకు తేరుకుంది రేఖ.

"ఏం లేదు సీతాలూ! తల నొప్పిగా ఉంది." అంది.

పాపనెత్తుకుని రాముడు కూడా, రేఖ కూర్చున్న దగ్గరకు వచ్చాడు.

"సీతాలూ! వంటపని పూర్తయ్యిందిగా? పిల్లలు పిమా కెళతామన్నారుగా? మేము వడ్డించుకుని భోం చేస్తాము. మీరు సినిమా కెళ్ళండి అంది."

పట్టలేని సంతోషంతో, రాముడితో సినిమాకి బయలుదేరింది పాప నెత్తుకుని సీతాలు.

సీతాలూ, రాముణ్ణి చూస్తుంటే, తన కంటే వాళ్ళెంతో అదృష్టవంతులనిపించింది రేఖకు. వాళ్ళను, లోకులు మనుష్యులనీ, చదువు సంధ్యలు లేని తక్కువ కులం వాళ్ళని అంటారు.

చదువు, సంధ్యలు లేకపోయినా, బయట ప్రపంచపు తీరు తెన్నులు తెలియకుండా, నూతిలో కప్పలాగా బ్రతికే రాముడికున్న హృదయసంస్కారం, ఎంతమందిచదువుకున్న వాళ్ళలో ఉంటుంది? భర్తను పోగొట్టుకుని మోడుబారిపోయిన, సీతాలు బ్రతుకులో వెన్నెలకురిపించాడు రాముడు. మరెవరోకన్న బిడ్డకు, తాను తండ్రిగా మారి, ఆ బిడ్డను గుండెల మీద మోసే, రాముడి వ్యక్తిత్వం ఎంత మంది యువకులకుంటుంది?

డిగ్రీ చదువులు చదివి, సమాజంలో సంస్కారవంతుడిగా పెద్ద మనిషిగా చలామణి అవుతున్న భర్త రవి–తను, ఎవ్వడో ప్రేమించాను అన్న నిజం తెలియగానే అనుమానంతో రగిలిపోతూ, ఇద్దరిజీవితాల్లోనూ మనశ్శాంతి లేకుండా చేసాడు. రాముడి సంస్కారం ముందు, భర్త సంస్కారం వెలి, వెల పోయినట్లనిపించింది రేఖకు. వికలమైన మనస్సుతో లోపలకు వెళ్ళింది రేఖ.

# రెండవ 'టెస్ట్‌ట్యూబ్ బేబీ' దుర్గ

ప్రపంచంలో రెండవ టెస్ట్‌ట్యూబ్ పాపాయి అక్టోబరు 3వ తేదీన కలకత్తాలో జన్మించింది. కలకత్తా డాక్టర్లు సుభాస్‌ముఖర్జీ, సరోజ్‌కాంతి భట్టాచార్యలు ఈ అద్భుత ప్రయోగంలో ఘన విజయాన్ని సాధించారు.

దేవీ నవరాత్రి ఆరంభ పర్వదినాన పుట్టిన ఈ పాపకు ఆమె తాతగారు శ్రీ పురుషోత్తమ్ అగర్వాల్ 'దుర్గ' అని నామకరణం చేశారు.

## కొత్త పద్ధతి

స్త్రీ అండాశయం నుంచి విడుదలైన అండాన్ని శరీరం వెలుపల వీర్యకణంతో కలిసేలా చేసి ఆ "పిండాన్ని" తిరిగి మాతృగర్భంలో ప్రవేశపెట్టి మామూలుగా ప్రసవం అయ్యేట్లు చేయడంలో ఈ డాక్టర్లు కృతకృత్యులైనారని, కొత్త పద్ధతిలో ఘనవిజయాన్ని సాధించారని పశ్చిమ బెంగాల్ ఆరోగ్యశాఖ డైరెక్టర్ శ్రీ మణిభౌమిక్ పేర్కొన్నారు.

టెస్ట్‌ట్యూబ్ పాప తాతగారైన శ్రీ అగర్వాల్‌కు నలుగురు కుమారులు, ముగ్గురు కుమార్తెలు. మిగతా యిద్దరు కుమారులకు, కుమార్తెలకు వివాహాలు జరిగి మామూలుగానే బిడ్డలు కలిగారు. పెద్దకొడుకు ప్రావత్‌కు మాత్రం 1963లో బేలాతో వివాహం అయినా పిల్లలు కలగలేదు. ఈ విషయంలో ఆ దంపతులు ఎందరో వైద్యులను, అతీతశక్తులున్నాయని చెప్పుకునే వ్యక్తుల్ని సంప్రదించి ప్రయోజనం లేకపోయింది. చివరికి వారి కుటుంబ వైద్యుని సలహా మేరకు డాక్టర్ ముఖర్జీని కలుసుకున్నారు. తమపై ఆయన ప్రయోగాలు నిర్వహించడానికి అంగీకరించారు. 1974లో డాక్టర్ ముఖర్జీ ఆ దంపతులపై ప్రయోగాలు ప్రారంభించారు.

## మూడవ ప్రయత్నం

ఇంతకు ముందు జరిగిన రెండు ప్రయత్నాలు బహుశ కడుపుపోవడంవల్ల విఫలమై ఉండి ఉండాలని, ఈ సంవత్సరం జనవరిలో జరిగిన ప్రయత్నం విజయవంతం అయిందని, జూలైలో డాక్టర్ భట్టాచార్య అక్టోబరు 10న ప్రసవం అవుతుందని చెప్పారని శ్రీ అగర్వాల్ అన్నారు.

బిడ్డలకోసం జరిగిన ఈ ఆధునిక వైజ్ఞానిక ప్రయోగానికి తమకుటుంబంలో గానీ, బంధువర్గంలో గానీ, మిత్రులనుంచి గానీ ఎలాంటి వ్యతిరేకతా వ్యక్తంకాలేదు పైగా ఈ పాప పుట్టుకకు వారంతా మహదానందాన్ని పొందారని శ్రీ అగర్వాల్ అన్నారు. "మాకు కూడా యిది చాలా గొప్ప విషయం. ఎందువల్లనంటే కుటుంబంలోని పెద్దకుమారునికి బిడ్డలు కలగాలని కోరుకుంటాము కదా" అనికూడా అన్నారాయన.



నిరాశ, నిస్పృహ చెందిన ఆ కుటుంబంలో ఆశాకిరణంగా అవతరించిన దుర్గ మామూలుగా పుట్టిన అందరు పాపల్లాగే కాళ్ళతో తంతూ స్తన్యాన్ని గోలుతూంది

## 'గొప్ప విజయం'

కలకత్తా డాక్టర్లు సాధించిన ఈ ఘన విజయాన్ని కొనియాడుతూ టోక్యోలోని గైనకాలజి ప్రొఫెసర్ డాక్టర్ ఆర్. ఐజుకా "ఇదొక గొప్ప విజయం. ఫలదీకరణం చెందిన అండాన్ని 53 రోజులపాటు గాఢమైన శీతలీకరణ ప్రక్రియ ద్వారా జాగ్రత్తచేసి అనంతరం గర్భాశయంలో ప్రవేశపెట్టడం అన్న ఈ కొత్త పద్ధతి ఫలదీకరణం చెందిన అండాల బ్యాంకులను నెలకొల్పేందుకు వీలు కలిగిస్తుంది" అన్నారు.

## 'ఎంతో విలువైనది'

క్యోటో విశ్వవిద్యాలయం జంతుశాస్త్రాచార్యుడు శ్రీ అకిరా ఇరిటానీ "ఇంతవరకూ యిలాంటి పద్ధతి బ్రిటన్, కెనడాలలో పశువులపై పరిమిత విజయావకాశాలతో ప్రయోగిస్తూవచ్చారు. గర్భాశయంలో ప్రవేశపెట్టక పూర్వం ఫలదీకరణం చెందిన అండాన్ని గాఢశీతలీకరణం ప్రక్రియ ద్వారా నిలవ ఉంచడం అన్న ఈ కొత్తపద్ధతి బ్రిటిష్ డాక్టర్లు అనుసరించిన దానికన్నా ఎంతో విలువైనది" అన్నారు.




*(గత సంచిక తరువాయి)*

## 3

శంకరరావు తెలుగు కాలెండరు తనతోపాటు ఆస్ట్రేలియా తీసుకువెళ్లాడు. పండుగలు వర్జ్యాలు తెలుస్తాయి. వర్జ్యం విషయంలో ఇండియన్ స్టాండర్డ్ టైములో పొద్దున్న ఆరుగంటలకి వర్జ్యం అని వుంటే దాన్ని లాంజిట్యూడ్ బట్టి స్టాండర్డ్ టైమ్స్‌లో వున్న తేడాతో సరిచేస్తే సరిపోతుందా లేక వర్జ్యం అనేది స్థానిక మైనదా? లాటిట్యూడ్‌ని బట్టి కూడా సరిచేసుకోవాలా? చేసుకోవాలంటే ఎల్లాగ చెయ్యాలి? శంకరరావుకి చాలా అనుమానాలు కలిగాయి. పూర్వం ఒకరోజు రాత్రి భోంచేసి పెళ్లాంతోను, పిల్లాడితోను రంగస్వామి ఇంటికి వెళ్లి ఆయనిచ్చిన బ్లాక్ కాఫీ తాగుతూ అడిగాడు, తన సందేహం గురించి శంకరరావు.

"ఆస్ట్రేలియన్ స్టాండర్డ్ టైముకి మారిస్తే చాలనుకొంటాను మేము వచ్చి చాలా రోజులవడంతో మా యింట్లో తెలుగు కాలెండరు లేదు" అన్నాడు రంగస్వామి.

"ఎందుకైనా మంచిది అటో పావుగంటా యిటో పావుగంటా వదిలేస్తేసరి" అంది లక్ష్మి.

"చూసి వర్జ్యం వుందని తెలిస్తే బాధ. చూడకపోతే ఏ బాధా లేదు" అన్నాడు రంగస్వామి.

"ఈయనకి తిథుల పట్టింపు అవీ చాలా వున్నాయి" అంది పార్వతి, "అందుకే మేము దశమినాడు బయల్దేరి ఏకాదశినాటి కిక్కడకి వచ్చాం. ఆయన త్రయోదశినాడు వెళ్లి జేరారు" అంది పార్వతి

అంతవరకు ఊరుకొన్న వనజ "ఈ దేశంలో వున్న 12 మిలియన్ల జనంలో తెలుగు కాలెండరు వున్న అదృష్టవంతులు మీరొక్కరే! మిగిలిన వాళ్లకి మంచేదో చెడేదో తెలియదు. అందుకని ప్రతీరోజు ఎనిమిదేసిగంటలు పన్చేసి చెడిపోతున్నారు. మనం అయితే ఎంచక్కా సగం తిథులు మంచివి కావని కొత్తపనులు మొదలుపెట్టం. మిగిలిన రోజుల్లో కొంతమందికి మంగళవారం వగైరాలు మంచివికావు. ఆ మిగిలిన రోజుల్లో వర్జ్యాలు, రాహుకాలాలు అంటూ కొన్ని గంటలు పోతాయి. అందుచేత యివాళ ఒక పని అయిందనుకోండి కొత్తది మొదలుపెట్టాలంటే మళ్లీ ముహూర్తం కుదరాలి. ఈ లోపల సినిమాలు గట్రా చూడ్డానికి మంచి చెడుల బాధ లేదు ఇండియాలో కొంతమంది పెద్ద పెద్ద శాస్త్రజ్ఞులు ఒక ప్రయోగం అయ్యాక కొత్తది చెయ్యటానికి ఇవన్నీ చూస్తూ కూర్చుంటారుట" అంటూ వేళాకోళం మొదలుపెట్టింది.

"ఇవన్నీ మన పూర్వీకులు ఊరికే పెట్టలేదు. ఎంతో అనుభవంతో చెప్పినవి" అన్నాడు శంకరరావు.

"ఒక సోమయాజులుగారికి ఒక టైములో ఏదో అయివుంటుంది. ఆయన అల్లాంటి టైములో ఏదైనా చేస్తే బెడిసికొడుతుందని ఓ ఎంపెరికల్ రూల్ పెట్టుకొంటాడు. అది తను పూర్తిగా నమ్మటం మొదలుపెట్టాక ప్రచారం మొదలుపెడతాడు. అది విన్న పదిమందిలో ఒక వెంకయ్యకి పదోసారి ఏదో ఎదురుతిరుగుతుంది. అతను "ఏరేసనండోయ్!" అంటూ సోమయాజులుగారి థీరీకి సపోర్ట్ ఇస్తాడు. అతనో పదిమందితో చెప్తాడు. అందులో మళ్లీ ఎవరికో ఎప్పుడో ఏదో జరుగుతుంది. శంకరరావుగారూ! ఇది చూసారా! మన దేశంలో ఒకరి చెడుకాలం ఇంకొకరి మంచికాలం. రాహుకాలం వర్జ్యం వేరు వేరు టైములో వస్తాయంటారు. తెలుగువాళ్లం వర్జ్యం చూస్తాము కన్నడంవాళ్లు రాహుకాలం చూస్తారుట. సుబ్బరాయుడుగారని వున్నారు బలారెట్‌లో ఆయన చెప్తారు. ఆఫ్ కోర్సు తెలివైనవాళ్లు అన్నీ అబ్జర్వ్‌చేసి పారేస్తారు! పదమూడో సంఖ్యతో సహా!" అంది వనజ.

"మీకు నమ్మకం వున్నట్టులేదు. మీకు నమ్మకం లేకపోయినంతమాత్రాన నమ్మినవాళ్లంతా ఫూల్స్ కారు" అన్నాడు శంకరరావు కోపాన్ని సాధ్యమైనంత తొక్కిపడుతూ.

"మా అమ్మాయి; మీ యూనివర్శిటీలో రాడికల్స్ అని వున్నారు, ఆ గ్రూపులో మెంబర్" అన్నాడు రంగస్వామి నవ్వుతూ.

"రాడికల్స్ అంటే?" శంకరరావు అడిగాడు. పార్వతి కుతూహలంగా చర్చ వింటోంది.

"నేను చెప్పనా వనజా?" రంగస్వామి కూతుర్నడిగాడు.

"చెప్పండి. పక్కన నేనున్నానని గుర్తుంచుకొని చెప్పండి" అంది వనజ నవ్వుతూ.

"నాన్నగారితో అల్లాగేనా మాట్లాడేది. ఈ దేశం వచ్చాక మా అమ్మాయికి విధేయత పూర్తిగా పోయింది" అంది లక్ష్మి.

"విధేయతలో బానిస భావం వుంది. బానిసత్వానికి మా రాడికల్స్‌కి చుక్కెదురు. నువ్వు నాకేదైనా కన్విన్సింగ్‌గా చెప్పు వింటాను. లేకపోతే నేను దాన్ని అనుమానించి క్వెశ్చన్ చేస్తాను.

> ***జరిగిన కథ - 2 :*** కొత్త జీవితం గడపటానికి స్వదేశం నుండి ఆస్ట్రేలియా వెళ్లిన శంకరరావుని, పార్వతిని — రంగస్వామి, ప్రొ. బ్రౌన్‌లు సాదరంగా ఆహ్వానించి వాళ్ల ఫ్లాట్‌కి తీసుకువెళ్తారు. పార్వతి టీచర్ ఉద్యోగానికి ప్రయత్నించి నిరాశ చెందుతుంది. తర్వాత కొన్నాళ్లకు ఒక బట్టల కంపెనీలో ఉద్యోగానికి చేరుతుంది.

జవాబు చెప్పు. మీపట్ల నాకు అభిమానం, మీ నాలెడ్జిపట్ల రెస్పెక్ట్ వుండాలిగాని, నాకు గుడ్డి విధేయత వుంటే, మీకు స్వంతంగా ఆలోచించలేని కూతురున్నందుకు మీరే బాధపడాల్సి నస్తుంది" అంది వనజ.

"ఈపాటికి మీకు కొంచెం అర్థమై వుంటుంది. నేను చెప్పదల్చుకొన్నదానికి మా అమ్మాయి ఉపోద్ఘాతం ఇచ్చేసింది. ఈ దేశం ఎబారిజినీస్‌ది. వాళ్ల దగ్గర ఇంగ్లీషువాళ్లు పది పూసలకి మెల్‌బోర్న్ కొన్నారు. ఇల్లాంటి అన్యాయాలు చాలా చేసి ఆస్ట్రేలియాని స్వంతం చేసుకొన్నారు. ఇప్పుడు వీళ్లు ఎబారిజినీస్‌ని కొన్ని సెటిల్‌మెంట్స్‌లో వుంచి వాళ్లు ఏమి చెయ్యవచ్చో ఏమి చెయ్యకూడదో, వాళ్లకేది మంచిదో ఏది కాదో చెప్తారు. వాళ్ల పిల్లల్ని తల్లిదండ్రుల వద్ద నుంచి వేరుచేసి దూరంగా పెంచుతారు. ఎబారిజినీస్‌ని వుండమని చెప్పిన స్థలంలో ఏమైన గనులున్నట్టు అనుమానంవస్తే వేరేచోటికి తరిమేస్తారు. మనల్ని అక్కడికి వెళ్లి వాళ్లని చూడనివ్వరు. ఈ దేశ పాలన విషయంలో వాళ్లకి ఏవిధమైన వాయిస్ లేదు. ఇటువంటి అన్యాయాలు..." అని రంగస్వామి చెప్తుండగా

"నశించాలి" అంది వనజ. పార్వతి నవ్వింది.

"వీళ్లు ఆస్ట్రేలియా ఎబారిజినీస్‌దే అని మనం అంతా వాళ్ల అతిథులమని నమ్ముతారు. ఈ రాడికల్స్‌లో కొద్దిగా ఏషియన్సున్నా ఎక్కువమంది ఆస్ట్రేలియన్సే! వీళ్లకి కమ్యూనిస్టులకి తేడాలేదు."

"మేము రాడికల్‌గా ఆలోచించేవాళ్లం. మాకు ఏ పార్టీ చెప్పింది మూర్ఖంగా నమ్మే అలవాటులేదు. ఎవరో ఆడించినట్టు ఆడం."

"వీళ్ల దృష్టిలో ఆస్ట్రేలియా ఆసియాకి దగ్గరగా వుంది కనక ఆసియా దేశాలతో సంబంధ బాంధవ్యాలు పెట్టుకోవాలి. దూరంగా వున్న ఇంగ్లండు అమెరికాలు నడిపించిన దార్లో నడవరాదు. తెల్లతోలుంది చాలు అంటూ అరబ్బుల్ని, గ్రీకుల్ని, ఇటాలియన్లని, ఇమ్మిగ్రేషన్ విషయంలో నెత్తిమీద పెట్టుకోవడం మాని అంతకంటే శక్తిమంతులైన ఏషియన్సుని ఆస్ట్రేలియాకి రానివ్వాలి. దానివల్ల ఆ దేశాల్లో జనసంఖ్య సమస్య తగ్గుతుంది. అక్కడ ఎంతోమంది కొద్ది స్థలంలో కొద్ది రిసోర్సెస్‌తో సరిపెట్టుకొంటుంటే సంపన్న దేశాలు కొద్ది జనసంఖ్యలో ప్రపంచంలోని ఎనభై శాతం రిసోర్సెస్‌ని అతివేగంగా ఖర్చుపెట్టడం అన్యాయం." రంగస్వామి చెప్తూ ఆగాడు.

"ఇంకోటుంది అందరు కష్టపడి పన్చేయాలి. సూపర్ స్టిషన్సు వదిలెయ్యాలి. రెలిజియన్, మనుషులకి విధేయత నేర్పుతుంది. విధేయత ప్రగతికి ప్రతిబంధకం. కనక దేవుడితో తెగతెంపులు చేసుకోవాలి. ఎల్లాగో మనం మంచి తలపెట్టి మంచి చేస్తున్నాం కనక దేవుడనే వాడుంటే తన పేరుమీద కాకపోయినా, తను సృష్టించిన జనం మంచిమార్గాన పోతూవుంటే, మంచిపనులు చేస్తూవుంటే ఆనందిస్తాడేగాని, ఉడుకుబోతు మనుషుల్లాగా 'నా పేరుమీద వెధవ

పనులు చేసినా ఊరుకొంటామునుగాని, నా ప్రసక్తి లేకుండా మంచిపనులు చేస్తున్న మిమ్మల్ని నాశనం చేస్తాను' అనడని అనుకొంటాం'' అంది వనజ.

ఇటువంటి చర్చలు చెయ్యటం పార్వతికి భయం. పార్వతి శనివారా లుంటుంది. అందుకని ''మీరు చీరలు కావాలంటే ఏం చేస్తారు ?'' అని అడిగింది లక్ష్మిని ప్రసంగాన్ని మరో దారి పట్టిస్తూ.

''ఇక్కడ కర్టెన్ల మెటీరియల్ కొనుక్కుంటే చీరలకి బావుంటుంది. కావాలంటే హాంగ్‌కాంగ్‌కో, సింగపూర్‌కో రాసి తెప్పించుకోవచ్చు'' అంది లక్ష్మి.

''మా ప్రొఫెసర్, ఆయన భార్య ఈమధ్య ఇండియా వెళ్ళొచ్చారు. ఆవిడ మన దేశంలో వాడే కర్టెన్ మెటీరియల్ తెచ్చుకొని డ్రెస్ కుట్టుకొంది'' అంది వనజ అక్కడితో వాతావరణం తేలికై చీరలమీదకి బట్టలమీదకి చర్చ మళ్ళింది.

శంకరరావుకి రోజు అవన్నీ గుర్తుకువచ్చాయి. ఎల్లుండి వినాయకచవితి. శంకరరావుకి వినాయకుడంటే చాలా భక్తి. దానికో కారణం వుంది. అతను ఇంజినీరింగ్ చదువుతున్న రోజుల్లో ఒక వినాయకచవితినాడు పెంకితనంగా చంద్రుడిని చూసాడు. ఆ సంవత్సరం ప్రిన్సిపాల్, శంకరరావుని ఏదో ఫంక్షన్‌లో అతిథులైన ఆడవాళ్ళమీద కాయితపు బాణాలు వేసాడని అల్లరి చేసాడని ఆరోపించాడు. శంకరరావు అవేవి చెయ్యలేదు. అతను కూర్చున్నచోట నుంచి బాణాలు వెళ్ళిన మాట నిజమే ! అక్కడ అల్లరి జరిగినమాటా నిజమే ! వాళ్ళనా పన్ను చెయ్యకుండా ఆపబోతే ''ఇటీజ్ ఆల్ ఇన్ ది గేమ్ ! గొడవచెయ్యకు'' అని వాళ్ళు శంకరరావుని కేకలువేసారు. శంకరరావు ''నేను కాదు ఫలానా'' అని చెప్పలేకపోయాడు. ఆ విషయం శంకరరావు తండ్రి దాకా వెళ్ళింది. ''నాయనా ! శంకరం ! మనం ధనికులంకాదు. నీకు రాబోయే డిగ్రీ మీద కుటుంబం ఆధారపడి వుంది. మంచి పేరు తెచ్చుకో'' అంటూ ఉత్తరం వ్రాసాడు శంకరరావు చాలా బాధపడ్డాడు. ఆడపిల్లల కొంగులు లాగడం, జడల్లోంచి పూలు తియ్యటం, కాయితపు బాణాలు వెయ్యటంలాంటివి వినోదాలుగా భావించటం అధమపు అభిరుచులని తన అభిప్రాయం. అటువంటి తనని, తను అసహ్యించుకొనే పనులు చేసాడని అధికారులు ఆరోపించటం, తండ్రి ఆ ఆరోపణ నమ్మినట్టుగా ఉత్తరం వ్రాయటం అతనికి బాధ కలిగించింది. దగ్గర స్నేహితుడితో ఈ విషయం చెప్పుకొని ఏడ్చాడు.

''వీటినే నీలాపనిందలు అంటారు. మొన్న వినాయకచవితినాడు చంద్రుడిని చూసావా ?'' అని ఆ స్నేహితుడు సగం హాస్యంగా, సగం సీరియస్‌గా అడిగాడు.

ఆ ప్రశ్న అప్పటికే అలజడికి అలసటకి లోనైన శంకరరావు మనస్సుని మరింత కలచి వేసింది. తను చూసాడు ! అందులోను పెంకితనంగా మరీను. అందుకే దేవుడు తనకి మంచి శాస్తి చేసాడు. తనకా శాస్తి అవాల్సిందే అనుకొన్నాడు. ఆ యేడు మళ్ళి కాలేజీలో ఏ ఫంక్షన్‌కి వెళ్ళలేదు.

కాని అతని గుర్తులేని విషయం ఒకటుంది. అతను ఆ యేడు వ్రతం చేసుకొని కథ చెప్పుకొని అక్షింతలు వేసుకొన్నాడు. నిజానికి అతనికేవిధమైన నీలాపనిందలు రారాదు. కాని వచ్చాయి. ఒకవేళ అతని కది గుర్తుకువచ్చినా ఆ పరిస్థితిలో ఏదో పూజాలోపం జరిగి ఉంటుందని నమ్ముతాడు. వినాయక చవితినాడు సాయంత్రం ఆనాటి విశేషం గుర్తుంటే చంద్రుడిని చూడాలన్న మానసిక చాంచల్యాన్ని అరికట్టుకోడం కష్టం. అందుకని శంకరరావు ఇన్ని సంవత్సరాల్లో కనీసం మరో పదిసార్లయినా చవితి చంద్రుడిని చూసే ఉంటాడు. ఆ సంవత్సరాల్లో ఏమీ జరగలేదు కనుక గుర్తు పెట్టుకోలేదు. మనస్సనే కంప్యూటర్‌లో మనం నమ్మిన, లేక మనకి నచ్చిన విషయాలే మెమరీలో స్టోర్ అవుతాయి. మిగిలినవి చెరిగిపోతాయి.

ఇప్పుడు శంకరరావుకి వచ్చిన సమస్య ఈ ఆస్ట్రేలియాలో వినాయకచవితి ఎల్లాగా చేసుకోవడం అన్నది. రంగస్వామి ఇంటికి వెళ్ళి అడిగితే వనజతో అనవసరమైన వాదం పెట్టుకోవాలి. అందుకని యూనివర్సిటీకి వెళ్ళి రంగస్వామికి ఫోను చేసాడు.

''మీ వినాయక వ్రతకల్పం పుస్తకంమీద వినాయకుడి బొమ్మ ఉందికదా ! దానికి జిరాక్స్ కాపీ తియ్యండి. పసుపుతో వినాయకుడిని చెయ్యండి. వెండి వినాయకుడు చిన్నది పార్వతిగారి దగ్గర ఉంటే సరేసరి'' అన్నాడు రంగస్వామి.

శంకరరావు ఆ విధంగానే చేసాడు వినాయకుడి కాయితం కింద తన రిసెర్చికి సంబంధించిన పుస్తకాలు పార్వతి ఎమ్మే పుస్తకాలు పెట్టాడు. చుట్టూ ఉన్న గరిక, పూలు పోగేసాడు. బజార్లో ఆపుల్స్, నారింజలు, అరిటిపళ్ళు కొన్నాడు. పార్వతి, శంకరరావు పూజ చేసారు. పిల్లాడిచేత కూడా రెండు పూలు వేయించారు. పిల్లాడు ఓ పట్టాన పూలు వదలకపోతే గుప్పిడి బలవంతంగా విప్పి, చెయ్యి దేవుడిమీద విదిల్చారు. పూజయ్యాక శంకరరావు యధావిధిగా యూనివర్సిటీకి వెళ్ళాడు. మరక్కడ వినాయక చవితికి సెలవులేదు. బొట్టుతో వెళ్ళడానికి ధైర్యం చెయ్యలేకపోయాడు. చెరుపుకోడానికి ధైర్యం చాలలేదు. సబ్బుపెట్టి మొహం కడుక్కుంటుంటే అదే చెరిగిపోయినట్టు



సరిపెట్టుకొని అప్పుడు వెళ్ళాడు. వెళ్ళినప్పటి నుంచి ఒకటే ఆలోచన ఏం చెయ్యాలి పూజాద్రవ్యాన్ని? అని. ఆస్ట్రేలియాలో ఏదైనా వీధిలో పారేస్తూ దొరికిపోతే చాలా పెద్ద జరిమానా వేస్తారు. పైగా తను వేస్తూ దొరికిపోతే అది భారతీయుల అనాగరకతగా న్యూస్ పేపర్లో వచ్చినా రావచ్చును. పోనీ ఇంట్లో వున్న గార్బేజ్ బిన్లో వేద్దామా అంటే అది బుధవారం, ఆదివారం తప్ప కార్పొరేషన్‌వాళ్ళు తీసుకువెళ్లరు. పైగా అందులో మెతుకులు, వాడిన సంతాన నిరోధకాలు, మట్టి వుంటాయి. అందులో చూస్తూ చూస్తూ ఎల్లా ఇవి వెయ్యటం! రంగస్వామి యివాళ ఆఫీసులో వుండను బయటికి పనిమీద వెళ్తానని చెప్పాడు. సాయంత్రం వాళ్ళింటికి వెళ్ళి కనుక్కోవాలి. కాని అక్కడికి వెళ్తే, "ప్రపంచ జనాభాలో హిందువులు ఏమాత్రం? సిక్స్‌టీన్, సెవెంటీన్ పర్సెంట్? మిగిలిన ఎనభైమూడు శాతానికి వినాయకుడెవరో తెలియదు. శమంతకమణి కథ తెలియదు. చవితి చంద్రుడిని చూడకూడదని తెలియదు. అందుకని వాళ్ళకి నిత్యం విఘ్నాలే! ప్రతియేడు నీలాపనిందలే! ప్రపంచంలో వున్న శతకోటి అనర్థాలకి అనంతకోటి ఉపాయాలు మన వ్రతాల్లో వున్నాయి. ఉయ్ ఆర్ లక్కీ! దేవుడు తన రహస్యాలన్నింటిని హిందువులకి చెప్పాడు. మీరా పూజాద్రవ్యాల్ని మనుషులు నడవనిచోట వదిలేసినా పక్షులు, పశువులు, ఇన్‌సెక్ట్సు అన్నీ తొక్కుతాయి" అంటూ వనజ తనమీద యుద్ధం ప్రకటిస్తుంది.

శంకరరావు యింటికి వచ్చి ఆరుగంటలకల్లా భోజనం ముగించాడు. భోజనం ముందర పార్వతిని దేవుడికి దీపం పెట్టమన్నాడు. భోజనం అయ్యాక పార్వతి సాయంతో దేవుడిని తప్పించి పూజా ద్రవ్యాలన్నీ పొట్లం కట్టాడు. ఓవర్ కోట్లు వేసుకొని పార్వతి, శంకరరావు ప్రామ్‌లో పిల్లాడిని వెచ్చగా పడుకోబెట్టి తోసుకొంటూ బయల్దేరారు.

క్లేటన్ టెక్నికల్ స్కూలు చుట్టూ చాలా ఖాళీ జాగా ఉంది. ఫెన్సు దగ్గర దుబ్బుగా మొక్కలు అవీను. చీకటి పడటంవల్ల, ఆరుకి ఏడుకి మధ్య ఆస్ట్రేలియన్సుకి భోజనం టైము అవడంవల్ల రోడ్డుమీద ఎవరు లేరు. ఆ రోజు

# ఆకర్షణా-వ్యామోహం

వర్కింగ్ డే అవ్వటంకూడా కలిసివచ్చింది. పార్వతిని, ప్రామ్‌ని అడ్డుపెట్టుకొని, ఫెన్సుమీద నుంచి ఎత్తుగా ఉన్న తుప్పల్లో పూజా ద్రవ్యం పారబోసి మళ్లీ ఆ కాయితాన్ని మడతపెట్టి జేబులో పెట్టేసుకొన్నాడు. మళ్లీ ప్రామ్ తోసుకొంటూ తమ ఫ్లాట్ వైపు నడిచారు. దార్లో చంద్రుడెక్కడ తన కంట పడకుండా శంకరరావు జాగ్రత్త పడాల్సిన అవసరం లేకపోయింది. ఆ రోజు మబ్బులు బాగా ఉండటంతో చంద్రుడు బయటకి రాలేదు.

"ఇంక నా ఉద్యోగ ప్రయత్నాలు ఏ విఘ్నం లేకుండా సాగుతాయి అనుకొంటాను" అంది పార్వతి.

"స్కూళ్లలో ట్రెయినింగ్ అవని టీచర్స్‌ని తీసుకోరాదని ట్రెయినింగ్ అయి ఉద్యోగాలు చేస్తున్న టీచర్సు ఆందోళన చేస్తున్నారుట. అందుకని మొనాష్ టీచర్స్ కాలేజివాళ్లు ఒక సంవత్సరంపాటు ఉండే డిప్లొమా పెట్టారు. దానికి నవంబర్లో ఎడ్వర్టైజ్‌మెంట్ వస్తుంది. ఫిబ్రవరిలో మొదలవుతుంది కోర్సు. దానికి అప్లై చేద్దూగాని. దానికి స్కాలర్‌షిప్ ఎక్కువే. ఇక్కడ స్కూళ్లలో ఎక్స్‌పీరియన్సుబట్టి జీతాలిస్తారు. నీకు ఇండియాలో ఎక్స్‌పీరియన్సుంది కనుక నీకు ట్రెయినింగ్ పీరియడ్‌లోకూడా, నువ్వు ఉద్యోగంలో ఉంటే ఎంత జీతం వచ్చేదో అంతే స్కాలర్‌షిప్ ఇస్తారు. అది టాక్సబుల్. నీకు నెలకి మూడు వందలు డాలర్లుదాకా వస్తాయి. అంటే నాకంటే ఎక్కువ" అన్నాడు శంకరరావు.

"మీ నోటి చలవన రానీండి" అంది పార్వతి.

## 4

వేసంగికాలం వచ్చింది. ఇంట్లో టి. వి. నెలకి ఎనిమిది డాలర్ల అద్దెకి తెచ్చుకొన్నారు. మెల్‌మెక్ డిన్నర్ సెట్ కొన్నారు. ఇండియాలో చేసిన చిల్లర అప్పులు తీర్చారు. శంకరరావు, యింటికి ఉత్తరం వ్రాస్తూ పార్వతికి ఉద్యోగం దొరికిందని తెలియజేశాడు. అది ఎటువంటి ఉద్యోగమో వ్రాయలేదు. ఇంట్లో అవసరానికి ఓ అయిదువందలరూపాయలు కూడా పంపాడు. శంకరరావు తండ్రి కోడలికి కూడా ఉద్యోగం దొరికినందుకు సంతోషం వ్యక్తబరుస్తూ, డబ్బు పొదుపుగా వాడుకుని, ఎప్పుడైనా మిగిలినది యింటికి పంపితే తను సంతోషిస్తానని, కాని కాని దేశంలో అనవసరంగా యిబ్బందిపడి తనకి డబ్బు పంపవద్దని వ్రాసాడు. రంగస్వామి కూడా శంకరరావుతో అదే చెప్పాడు.

"మీ భార్య యిక్కడ కూలిపని చేసి సంపాదిస్తోందన్న విషయం మన దేశంలో ఎవరూ ఆలోచించరు. మీరు కష్టపడ్డా మన దేశంలోని మీవాళ్లకి డబ్బు పంపితే మీవాళ్ల అవసరాలు పెరుగుతాయి. మీరు కష్టపడ్డా కూడా అనుభవించలేని దర్జాలు వాళ్ళు కష్టపడకుండా, మీ డబ్బుతో అనుభవించడానికి అలవాటుపడ్తారు. మనం యిక్కడకు వచ్చి ఏదో బావుకొంటున్నామని అనుకొంటారు. పార్వతిగారు, లక్ష్మి గూడా పని మనిషి సహాయం లేకుండా అంత పని చేసుకొంటున్నారుకదా! అదే మన దేశంలో మన స్థాయిలో అందరిళ్లలోను పని మనిషి వుంటుంది. వ్యామోహంకొద్దీ విదేశాలు వస్తామే కాని ఇక్కడ వరగపెట్టుకొనేది ఏమీ లేదు. కనీసం ఇక్కడున్న కొద్ది సంవత్సరాలలో కొంత డబ్బు దాచుకొని మన దేశం వెళ్తే ఇల్లు కట్టుకొనేందుకో లేక ఇల్లు కట్టుకొనే స్థలం కొనడానికో సరిపోతుంది." శంకరరావుకి నిజమేననిపించింది.

రంగస్వామి ద్వారా, తన ఉద్యోగం ద్వారా శంకరరావు కొంతమంది స్నేహితుల్ని సంపాదించాడు. షీలాభట్, కృష్ణకాంత్‌భట్ అనే యిద్దరు గుజరాతీలు, ఇయాన్ స్మిత్, బెట్టిస్మిత్, బాబ్‌స్మిత్ అనే ఆస్ట్రేలియన్సు రంగస్వామి ద్వారా పరిచయం అయినవాళ్లు. ఒకసారి రంగస్వామి తన ఇంట్లో బఫే డిన్నర్ ఏర్పాటుచేసి శంకరరావుని పార్వతిని కూడా పిలిచాడు.

ఇయాన్ ఆరోజున శంకరరావుని "మీ మనసు దోచుకొనే అబ్బాయి పేరు ఏమిటి?" అని అడిగాడు పరిచయాలు అయ్యాక. శంకరరావు మొదట్లో ఆస్ట్రేలియన్సు నోళ్లలో నిత్యం వుండే "ఛార్మింగ్" "ఫెన్‌టాస్టిక్" "గార్జియస్" అన్న మాటలను నిజంగా అంటున్నారేమో అనుకొనేవాడు. కాని రెండు మూడు నెలల్లో వాళ్లకి మెచ్చుకోళ్ళు పొగడ్తలు ఓ అలవాటని గ్రహించేసాడు. తన కొడుకు పట్ల ఇయాన్ వాడిన విశేషణానికి కొద్దిగా నవ్వుకొని, "బాబు" అన్నాడు.

"అయితే నా పేరే నన్నమాట. నా పేరంటే మీ కిష్టం అన్నమాట" అన్నాడు బాబ్.

"నాకు బాబ్ అనే పిలుపు ఇష్టం. కాని మా అబ్బాయి పేరు బాబు. నీ పేరు రాబర్ట్ నుంచి వచ్చింది. మావాడి దల్లాకాదు. వాడి అసలు పేరు నారాయణమూర్తి" అన్నాడు శంకరరావు. బాబ్‌కి ఆ రెండు పేర్లకి లంకె అందలేదు. కాని ఆ భావం బయటికి తెలియ కుండా,

"బాబు, వాళ్ల అమ్మలాగా చాలా అందమైన వాడు" అన్నాడు. పార్వతి దూరంనుంచే సిగ్గు పడింది, వయస్సులో ఉన్న మగవాళ్లు, ఇతర ఆడవాళ్ల అందచందాల్ని పొగడగా వినడం అనే అలవాటు లేక.

"మరే" అన్నాడు ఇయాన్.

"బాబు వాళ్ల నాన్నలాగా పొడుగ్గా అవుతా డనిపిస్తోంది" అంది బెట్టి.

ఇయాన్, బెట్టీలు, రంగస్వామి లక్ష్మిలకు స్నేహితులు. బాబ్ వనజకి స్కూల్లోను యూనివర్సిటీలోను ఒక సంవత్సరం పైన ఉన్నాడు. కొద్దిసేపట్లోనే బాబ్‌కి 'వన్జ' అంటే చాలా ఇష్టమని శంకరరావు, పార్వతి గుర్తించారు. వనజకి కూడా బాబ్ అంటే ఇష్టమన్న సంగతి తెలుస్తూనే ఉంది.

రంగస్వామి లోపలనుంచి గ్లాసుల్లో షెర్రీ, విస్కీ పళ్లరసం పోసి తీసుకొనివచ్చాడు. ఇయాన్, భట్ విస్కీ తీసుకొన్నారు. శంకరరావు మొహమాట పడ్తూ తియ్యగా ఉండే షెర్రీ తీసుకొన్నాడు.



విజయవాడలో జరిగిన కార్టూన్ పోటీలో దర్శకుడు శ్రీ బాపు - శ్రీ రాంబాబుకు బహుమతి ప్రదానం చేస్తున్న దృశ్యం. మధ్య ఉన్నవారు శ్రీ పురాణం సుబ్రహ్మణ్యశర్మ.



# పెరుగుతున్న సంవత్సరాలు

# కాల్షియం-శాండోజ్®

# సంవత్సరాలు










పాప పుట్టక ముందు నుంచే, పాప యొక్క పళ్ళూ ఎముకలూ రూపొందటం మొదలెడతాయి. పసిదనం నుంచీ, పెరిగే వయస్సులో అంతా కూడా కాల్షియం ఎంతో కీలకమైనది.

మీ పాపకి గనక, పెరుగుతూన్న ఏ దశలోనైనా సరే, అవసరమైనంత కాల్షియం లభించకపోతే, తరవాత ఎంత యిచ్చినా ప్రయోజనం ఉండదు. అందుకే నేడే మీ పాపకు కాల్షియం-శాండోజ్ యివ్వడం మొదలెట్టండి. రోజుకు నాలుగు కాల్షియం-శాండోజ్ బిళ్ళలు గనక యిస్తే, అవి పెరిగే దశలోని ఆ ఏళ్ళలో అత్యవసరమైన కాల్షియంను సమకూర్చి, గట్టిపళ్ళనూ, పటిష్టమైన ఎముకలనూ రూపొందిస్తాయి. విటమిన్ సి, డి మరియు బి[12]తో పటిష్టం చేయబడిన కాల్షియం-శాండోజ్ బిళ్లల్లో, పిల్లలకి యిష్టమయ్యే రుచిగల వెపీలా సువాసన ఉంది.

**కాల్షియం-శాండోజ్ స్విట్జర్‌లాండ్‌లోని శాండోజ్ వారు రూపొందించినది, ప్రపంచంలోని అత్యుత్తమమైన కాల్షియం.**

## కాల్షియం-శాండోజ్®

## గట్టిపళ్ళు, పటిష్టమైన ఎముకల కోసం




daCunha/CS/26 TEL

# జి. ఏ. జి. పేజీ

## విజయదశమినాడు ప్రారంభోత్సవాలు

విజయనిర్మల స్క్రీన్‌ప్లే, దర్శకత్వంలో ఆమెతోపాటు ఎ. ఎన్. ఆర్., కృష్ణ, జరీనావహాబ్, సత్యనారాయణ, సుమ్మడి, గిరిబాబు, త్యాగరాజు, కృష్ణకుమారి, పండరీబాయి నటించే శ్రీ విజయకృష్ణ మూవీస్ సినిమాస్కోప్ వర్ణ చిత్రానికి విజయా గార్డెన్స్‌లో "పున్నమివెన్నెల



'మరో సీత కథ'లో జయమాలిని, మోహన్‌బాబు

ప్రేమించింది" అనే ఆత్రేయ గీతం రమేష్‌నాయుడు స్వరకల్పనలో ధ్వనిముద్రిక చేయబడడంతో ప్రారంభోత్సవం జరిగింది. మహారథి రచయిత. పుష్పాల గోపాలకృష్ణ ఛాయాగ్రాహకుడు. శిల్పం : తోట. కూర్పు : ఆదుర్తి హరనాథ్. నిర్మాత : ఎస్. రఘునాథ్. నిర్వహణ : ఎస్. రవికుమార్. అన్నపూర్ణ స్టూడియోలో నవంబర్ 2న షూటింగ్ ప్రారంభం.

శ్రీ యార్లగడ్డ వెంకన్నచౌదరి కెమెరా స్విచ్ ఆన్, శ్రీ అనుమోలు జగన్మోహనరావు తొలి క్లాప్‌తో కమలాకర కామేశ్వరరావు దర్శకత్వంలో జాగర్లమూడి రాధాకృష్ణమూర్తి స్కోప్ కలర్‌లో నిర్మించే జగన్మాతా ఆర్ట్స్ "శ్రీ వినాయక విజయము" చిత్రం సత్యా స్టూడియోలో ప్రారంభించబడింది. కృష్ణంరాజు, రామకృష్ణ, సత్యనారాయణ, రావుగోపాలరావు, పద్మనాభం, రాజబాబు, వాణిశ్రీ, ప్రభ, జయమాలిని, హలం, వైజయంతి, బేబీ లక్ష్మీసుధా వగైరా తారాగణం. వీటూరి సంభాషణలకర్త. ఎస్. రాజేశ్వరరావు స్వరకల్పనలో దేవులపల్లి కృష్ణశాస్త్రి, వీటూరి, వేటూరి సుందరరామమూర్తి గీతాలు రాశారు. కె. ఎస్. ప్రసాద్ ఛాయాగ్రాహకుడు. విజయారావు సహదర్శకుడు. ఎస్. వి. కృష్ణారావు సహకార దర్శకుడు. నిర్వహణ : అశోక్‌కుమార్. శిల్పం : వాలి. కూర్పు : వీరప్ప కథ, ప్రొడక్షన్ కంట్రోలర్ : బోణం ఆంజనేయులు. సహ నిర్మాతలు : ఎన్. ఎన్. స్వామి, పి. రాంబాబు.

కొమ్మినేని శేషగిరిరావు దర్శకత్వంలో పింజల ఆనందరావు నిర్మించే ఆనందలక్ష్మి ఆర్ట్ మూవీస్ "లక్ష్మీపూజ" చిత్రం ప్రసాద్ స్టూడియోలో ప్రారంభించబడింది. చిల్లర భావనారాయణ రచయిత. సత్యం సంగీత దర్శకుడు హెచ్. ఎస్. వేణు ఛాయాగ్రాహకుడు. జయమాలిని కథానాయిక.

శక్తి సినీ ఎంటర్‌ప్రైసెస్ "కెప్టెన్ కృష్ణ" స్కోప్ కలర్ చిత్రంలో కృష్ణ, శ్రీప్రియ నాయకా నాయికలు. ఎస్. పి. బాలసుబ్రహ్మణ్యం సంగీత దర్శకుడు. ముళ్ళపూడి వెంకటరమణ రచయిత. పి. దేవరాజ్ ఛాయాగ్రాహకుడు. శిల్పం : సి. వి. సుబ్బారావు. నిర్వహణ : ఆలపాటి రాధాకృష్ణారావు. రాజశేఖర రెడ్డి నిర్మాత. కె. ఎస్. ఆర్. దాస్ దర్శకుడు.

పి. చంద్రశేఖర రెడ్డి స్క్రీన్‌ప్లే, దర్శకత్వంలో ఎం. పీతాంబరం నిర్మించే విజయకళ ఆర్ట్స్ "పంచభూతాలు" వర్ణ చిత్రం ఎస్. ఎస్. బాలన్ క్లాప్, తమిళనాడు ముఖ్యమంత్రి శ్రీ ఎం. జి. ఆర్. కెమెరాకు చలనం కలిగించడంతో



'వజ్రాల వేట'లో హలం

సత్యా స్టూడియోలో ప్రారంభించబడింది. నటవర్గం : చంద్రమోహన్, రావుగోపాలరావు, నూతన్‌ప్రసాద్, కె. కె. శర్మ, సి. హెచ్. కృష్ణమూర్తి, భీమరాజు, నూతన నటుడు గోపీకృష్ణ, లత, సత్యప్రియ, అనిత, లక్ష్మి, పొట్టిప్రసాద్. మా లక్ష్మణన్ కథకు మోదుకూరి జాన్సన్ సంభాషణలు రాశారు. ఇళయరాజా స్వరకల్పనలో ఆత్రేయ గీతాలు రాశారు. ఎం. సి. శేఖర్ ఛాయాగ్రాహకుడు. శిల్పం : శ్రీనివాసరావు. సహకార దర్శకుడు : మన్నె రాధాకృష్ణ. ప్రొడక్షన్ ఎగ్జిక్యూటివ్స్ : రామదాస్, మణివానన్.

రాజేష్ ఆర్ట్ పిక్చర్స్ తొలి వర్ణ చిత్రానికి విజయా గార్డెన్స్‌లో పాటల రికార్డింగ్‌తో ప్రారంభోత్సవం జరిగింది. చంద్రమోహన్ హీరో. సి. హెచ్. భగవాన్‌దాస్ సమర్పించే ఈ చిత్రానికి టి. కృష్ణ దర్శకుడు. ఎం. నరసింహారావు నిర్మాత. జంధ్యాల సంభాషణలకర్త. మహదేవన్ సంగీత దర్శకుడు. పి. ఎస్. ప్రకాష్ ఛాయాగ్రాహకుడు.

## ఆకర్షణా-వ్యామోహం

అతనికి విస్కీలో రుచి అర్ధమయ్యేంతగా మధువు అలవాటు కాలేదు. బెట్టీ షెర్రీ తీసుకొంది. లక్ష్మి ఆపుల్ జ్యూస్ తీసుకొంది. పార్వతి ఆరెంజి జ్యూస్ తీసుకొంది. వనజ, తనకి బిల్‌కి ఆపిల్ సైడర్ తెచ్చింది. షీలా భట్,

"నాక్కూడా సైడర్ ఇయ్యి వనజా" అని వనజతో చెప్పి పార్వతివేపు తిరిగి "మేము వచ్చి రెండు సంవత్సరాలైనా నాకు తాగుడంటే ఏదోలా ఉంటుంది. కృష్ణ మాత్రం ఇలా బయటికి వచ్చినప్పుడు తాగుతాడు. బాటిల్స్ కొని ఇంట్లో మాత్రం పెట్టడు. నేను పెట్టనీయననుకోండి" అంది.

భోజనాల దగ్గర భట్ శుభ్రంగా నిర్మొహమాటంగా కోడి కూర వడ్డించుకొని తినడం మొదలుపెట్టాడు.

"నేను షీల కంటే ఒక సంవత్సరం ముందర వచ్చాను దేశం. ఇక్కడ వెజిటేరియన్ను మాడిచావాల్సిందే, భార్య వుండి వండిపెట్టినా, వాళ్ళే వండుకొన్నా కూడా బయటికి వెళ్ళినప్పుడీ యిబ్బంది తప్పదు. అందుకని అన్నీ తినటం అలవాటు చేసుకొన్నాను. అందుకని నన్ను భోజనానికి పిలవడానికి ఆస్ట్రేలియన్సు భయపడరు. అదే షీలను పిలవాలంటే వాళ్ళకి చచ్చేంత భయం. మడికట్టుక్కూర్చుంటుంది" అంటూ శంకరరావుకి తను గురించి చెప్పుకొన్నాడు, "శాకాహారివై యుండి మాంసం తింటున్నావేం?" అని శంకరరావు ఎక్కడ అడిగిపోతాడో అన్న ధోరణిలో.

మరోమూల వనజ కళ్ళలోకి చూస్తూ బాబ్ అడుగుతున్నాడు "మీరు ప్రతీదాంట్లో ఇంతలేసి స్పైసెస్ వేస్తారుకదా! మీకు ప్యూర్ మాంసం రుచి ఎలా తెలుస్తుంది? వంటకాలు అన్నీ స్పైసెస్ రుచిలోనే వుంటాయి."

వనజ నవ్వుతూ "మీరు ప్రతీదాంట్లో సీసాడు టొమేటో సాస్ వంచుకొని తింటారుకదా, మీ నోటికి తెలిసే రుచి టొమేటో సాస్‌దే అయినప్పుడు, అన్నిరకాల వంటకాలు ఇటాలియన్, స్పానిష్, అంటూ పేర్లు పెట్టి వండుకొంటారు ఎందుకు?" అంది. బాబ్ కూడా నవ్వేసాడు. "మనకి అవతలవాళ్ళ అలవాట్లే ఏదో సరిగా లేనట్టు అనిపిస్తాయి. మన అలవాట్ల గురించి ఆలోచించము" అన్నాడు.

[ఇంకా వుంది]

## వజ్రాల వేట

అప్సర ఆర్ట్స్ పతాకంలో ప్రముఖ చిత్ర నిర్మాత, పారిశ్రామికవేత్త సమర్పించే "వజ్రాల వేట" చిత్రం దాదాపు 30 లక్షల రూపాయల వ్యయంతో భారీ ఎత్తున తయారై, కర్నాటక రాష్ట్రంలో 25 వారాలపాటు ప్రదర్శింపబడి, బాక్సాఫీస్ వద్ద కొత్త రికార్డు సృష్టించింది. అనంతనాగ్, ఆరతి, జయమాలిని, పాలం మున్నగు వారు నటించిన ఈ సస్పెన్స్ థ్రిల్లర్ తెలుగు వెర్షన్ త్వరలో విడుదల కానున్నది.

## కత్తిరింపులలో రికార్డ్

బి. ఆర్. ఇషారా నిర్మించే ప్రతి చిత్రానికీ సెన్సార్ కత్తెర పడుతూనే వుంటుంది. ఈ విషయంలో ఆయనకన్నా ముందు పేర్కొనవలసిన వ్యక్తి బి. కె. ఆదర్శ్. అతని తొలి చిత్రం "అంధకార్" నిషేధింపబడి, అంధకారంలో పడిపోగా — చేర్పులు, మార్పులలో మళ్ళీ షూట్ చేసి, "మనో యానా మనో"గా పేరు కూడా మార్చాక 'ఎ' సర్టిఫికేట్‌తో విడుదల కాగలిగింది. "గుప్తజ్ఞాన్" చిత్రానికి తర్జనభర్జనల అనంతరం 'ఎ' సర్టిఫికేట్ లభించినా — అత్యవసర పరిస్థితి కాలంలో నిషేధించబడింది. ఇప్పుడతను సుప్రీమ్ కోర్టులో రిట్ వేశాడు. ఇంకో చిత్రం "ప్రైవేట్ లైఫ్" కూడా నిషేధించబడింది. కొత్తగా "సంపూర్ణ సంత్ దర్శన్" అనే పౌరాణికం తీశాడు. అదికాస్తా ఎన్నో కోతలకు గురియై, చివరికి కోర్టు ద్వారా విడుదలకు నోచుకోగలిగింది.

## పాత్ర పేరు మార్పు

"ప్రభాత్" అనే హిందీ చిత్రంలో నర్గిస్ మేనకోడలు జహీరా ఓ వేశ్య పాత్ర ధరించింది. ఆ పాత్ర పేరు నర్గిస్. ఈ విషయం తెలిసి నర్గిస్ తన అభ్యంతరం తెలియజేయగా — నిర్మాత రాందయాళ్ ఆ పాత్ర పేరును మార్చేశాడట.

కేంబ్రిడ్జ్ సీనియర్ పరీక్ష పాసయిన నర్గిస్ 1929 జూన్ 1న కలకత్తాలో జన్మించింది. వయసులో భర్త సునీల్‌దత్‌కన్నా ఏడాది పెద్ద. "మదర్ ఇండియా" షూటింగ్ సమయంలో తనను అగ్నిప్రమాదంనించి కాపాడిన సునీల్‌ను ఆమె పెళ్ళాడింది. సునీల్ అసలు పేరు బాలరాజ్. చాలా కష్టపడి పైకొచ్చాడు. అతని 6వ ఏటనే తండ్రి పోవడంతో లక్నోలో ఏదో కూలిపని చేసి కుటుంబాన్ని పోషించసాగాడు. ఆ తర్వాత బొంబాయికి వచ్చి ట్రాన్స్‌పోర్ట్ శాఖలో పని చేస్తూ, రాత్రిళ్ళు చదువుకోసాగాడు. చివరికి 'రేడియో సిలన్' అనౌన్సర్‌గా చేరాడు. అతని తొలి చిత్రం "రైల్వే ప్లాట్‌ఫామ్". అందులో ఒక నేపథ్య గానానికి అతను సరిగా పెదవులు కదిలించలేకపోయినందుచేత — కొన్ని షాట్‌లను 12 సార్లు వరకు తీయవలసివచ్చింది. అతని ఆఖరి చిత్రం కూడా అదే అవుతుందనుకున్నారంతా. తద్విరుద్ధంగా అతను నటుడుగా స్థిరపడి, దర్శక నిర్మాత అవడమే కాకుండా భార్యతోపాటు "పద్మశ్రీ" గౌరవాన్ని కూడా పొందాడు.

## రాముడు - రంగడులో రమేష్ రసికత

జమీందారుకి వారసుడుగా ఆ గ్రామంలోకి ప్రవేశించాడు వాళ్ళబ్బాయి రమేష్. అంతవరకు అక్కడ సర్వాధికారిగా వున్న పుణ్యకోటి తన నుందీ మార్బలాన్ని రమేష్‌కు పరిచయం చేయసాగాడు. కొండడిని జమీందారీకి కోట గోడ అని, దానుని తన కుడిభుజం అని చెప్తూండగా— పక్కనున్న వ్యక్తులలో ఒకడు "నా పేరు కాకా కిష్టయ్యండి. మా అయ్యగారు ముద్దుగా 'కాకి' అంటారు," అన్నాడు. మరొకడు "నా పేరు పాపాల పిచ్చయ్యండి. నన్ను 'పాపి' అంటారు," పరిచయం చేసుకున్నాడు. "మీరిద్దరూ భ్రటాజులా ?" నవ్వాడు రమేష్. "కాదండి; జంట వైద్యులం !" మొరపెట్టుకున్నారిద్దరూ.

"లోపలికి రా, బాబూ !" అంటూ రమేష్‌ని లోపలికి తీసుకెళ్ళి, గౌరిని పరిచయం చేశాడు పుణ్యకోటి. "వండ్రఫుల్, మామా ! ఎవరీ మనిషి ?" అడిగాడు రమేష్. "మన పనిమనిషి," అన్నాడు పుణ్యకోటి. "గుడ్ ! మనకు పనికొచ్చే మనిషి," సాభిప్రాయంగా అన్నాడు రమేష్. "తప్పు! గౌరి నాకు కూతురులాంటిది," అన్నాడు పుణ్యకోటి. "అయితే ఇంకేం ? వెరీ వెరీగుడ్ !" వరస కూడా కలుస్తుందన్న ధోరణిలో నొక్కి పలికాడు రమేష్.

దేశానికి పట్టుకొమ్మ అయిన పల్లెసీమల్లో పేరుకుపోయి వెర్రితలలు వేసే స్వార్థపరత్వానికి ప్రతీకగా పి. చంద్రశేఖరరెడ్డి స్క్రీన్ ప్లే, దర్శకత్వంలో తమ్మా రఘునాధరెడ్డి నిర్మించిన భారతీ ఆర్ట్స్ క్రియేషన్స్ "రాముడు – రంగడు" వర్ణ చిత్రంలో కృష్ణంరాజు, శ్రీధర్, శరత్‌బాబు, రావుగోపాలరావు, ఎం. రంగారావు, చంద్రకళ, ప్రభ, సంగీత, అనిత, నిర్మల, స్వర్ణ, సారధి, గిరగ, అర్జా జనార్దనరావు, కాశీనాథ్ తాతా, వగైరా నటవర్గం ... రాజశ్రీ, చక్రవర్తి, లక్ష్మణ్ గోరే, నాయని మహేశ్వరరావు, మనోహర్ దత్, మోహన్‌జీజగన్, పొన్నతోట రఘురాం, ముత్యాల సుబ్బయ్య, భీమవరపు బుచ్చిరెడ్డి ప్రభృత సాంకేతికవర్గం ... సమర్పణ : తమ్మా రంగారెడ్డి.



'మాయింటి దేవత'లో హరనాథ్, మధు

## "ఏది పాపం - ఏది పుణ్యం"లో యువతులకు పరీక్షా సమయం

వనితల హాస్టల్... అరుణ పాత్రలో మా(...), రజని పాత్రలో సరోజ తదేక దీక్షతో చదువుకుంటున్నారు. ఒకమ్మాయికి మాత్రం చదువుమీద దృష్టి లేదు ఆవులిస్తూ, "అబ్బా ! నిద్రొస్తోంది. ఈ ఆఖరి పరీక్ష అయిపోతే, ఈ చదువుకో గుడ్‌బై కొట్టొచ్చు" అంది.

"అంత ఇష్టం లేనిదానివి – ఇంత దూరం వచ్చి, ఇంత డబ్బు తగలెయ్యడం దేనికే ? అది సరేనే, సుజా ! నీ ఫ్యూచర్ ప్రోగ్రామ్స్ ఏమిటి ?"

"దానికేమే – హాయిగా ప్రేమించిన వాడున్నాడు. వాడికి బోలెడు డబ్బుంది" అంది మరో అమ్మాయి.

"ఛీ–పాడు ! ప్రేమట ప్రేమ ! అసలు మగాడ్ని ప్రేమించానని చెప్పడం అన్నా, మగాడి సావాసం అన్నా ఒళ్ళు కంపరమెత్తుతుంది. సిగ్గు లేకుండా ఎట్లా చెప్తారో ఏమిటో ! అన్నట్టు – నీ ప్రోగ్రామ్ ఏమిటే, అరుణా ?" అడిగింది రజని.

"నా ప్రోగ్రామా ? వాగుడు మానెయ్యకపోతే – మీ అందర్నీ పట్టుకు తన్నడం. రేపు పరీక్ష. పెళ్ళి చూపులు కాదు. పిచ్చివాగుళ్ళు మానేసి చదువుకోండి" అంది అరుణ.

కె. వాసు దర్శకత్వంలో కె. మహేంద్ర, త్రిపురమల్లు వెంకటేశ్వర్లు నిర్మించిన టి. వి. ఫిలిమ్స్ ఈస్ట్‌మన్ కలర్ చిత్రం "ఏది పాపం – ఏది పుణ్యం"లో చంద్రమోహన్, నూతన్‌ప్రసాద్, ఎం. రంగారావు, సారథి, కె. వి. చలం, హరిబాబు, చక్రపాణి, విజయభాను, అత్తిలి లక్ష్మి ఇతర పాత్రధారులు. గోపి రచయిత. సత్యం సంగీత దర్శకుడు.



'రాముడు–రంగడు'లో చంద్రకళ, కృష్ణంరాజు



# సంక్షిప్త చిత్ర వార్తలు

★ "కాలం మారింది" లాంటి ప్రతిష్టాత్మక చిత్రాలను నిర్మించిన వాశిరాజా ప్రకాశం కొత్త చిత్రం జయశ్రీ చిత్రవారి "బొమ్మల కొలువు" హైదరాబాద్ పరిసరాలలో చిత్రీకరింపబడుతుంది.

★ కల్యాణ చిత్ర నిర్మించే తొలి చిత్రంలో మురళీమోహన్, జయలక్ష్మి, సుమంగళి, అల్లు రామలింగయ్య, కాంతారావు, నాగేష్, అంజాద్ కుమార్, మనోరంజన్ వగైరా నటవర్గం. అప్పలాచార్య రచయిత. జె. వి. రాఘవులు స్వరకల్పనలో ఆత్రేయ, కొసరాజు గీతాలు రాశారు. శిల్పం : కె. రామలింగేశ్వరరావు. సహకార దర్శకుడు : ఎం. కృష్ణమోహనరెడ్డి. కూర్పు : గౌతమ్. నిర్మాతలు : కోవూరు వెంకట సుబ్బారావు, పి. పి. అబ్దుల్లా. కథ, స్క్రీన్‌ప్లే, దర్శకత్వం : రాజశేఖర్.

★ రజనీకాంత్, శ్రీప్రియ, గీత, వై. విజయ మున్నగువారు నటించిన "భైరవి" చిత్రం పి. చంద్రశేఖరరెడ్డి సహకార దర్శకుడుగా పలు చిత్రాలలో పనిచేసిన మన్నె రాధాకృష్ణ నేతృత్వంలో తయారవుతోంది. రచన : కోమల కృష్ణారావు. సంగీతం : ఇళయరాజా. సమర్పణ : దాసం సీతారామయ్య. నిర్మాతలు : కొల్లిపర శేషగిరిరావు, ఏల్చూరి వెంకటేశ్వర్లు. శాంతి ఆర్ట్ మూవీస్ నిర్మాణం.

* * *

## ఉమాలక్ష్మీ కంబైన్స్ తాజా చిత్రం

ఎస్. ఎస్. భట్, ఎస్. ఎస్. మూర్తి స్కోప్—కలర్‌లో నిర్మించే చిత్రంలో కృష్ణ, రజనీకాంత్ ముఖ్య భూమికలు నిర్వహిస్తారు. భమిడిపాటి రాధాకృష్ణ రచయిత. కె. ఎస్. ఆర్. దాస్ దర్శకుడు. ఫిబ్రవరినించి షూటింగ్ ప్రారంభం.

## హీరోయిన్‌ల గురించి శ్రీవిద్య

"శ్రీదేవి ఎంత ఓవర్‌గా షూటింగ్‌లలో పాల్గొంటూందంటే — రాత్రిళ్ళు నిద్రలో 'మేకప్ ! డ్రస్ ఛేంజ్' అని కలవరిస్తూంటుందట" అన్నారొకరు.

"హీరోయిన్‌లకు కూడా వయోపరిమితి అంటూ ఉంటే బాగుంటుందని నా అభిప్రాయం... 16—17 ఏళ్ళనించి నాయికల వేషాలు వేసేవారు 30 ఏళ్ళ తర్వాత అలాంటి వేషాలకు స్వస్తి చెప్పి, కేరెక్టర్ రోల్స్ వేయాలి షావుకారు జానకిగారికి మల్లే. అప్పుడే వాళ్ళ ఇమేజ్‌ని కాపాడుకో గలుగుతారు" అంది శ్రీవిద్య.

## సాంకేతిక నిపుణుల చిత్రం

పలువురు సాంకేతిక నిపుణులు కలిసి రాఘవేంద్రా శ్రీ ఆర్ట్స్ పతాకంలో తొలిసారిగా "పంచ ప్రాణాలు" అనే సాంఘిక చిత్రాన్ని నిర్మిస్తున్నారు. అక్టోబర్ 6న ఉపేంద్రకుమార్ సంగీత దర్శకత్వంలో ఎస్. జానకి పాడిన విజయరత్నం గీతం, 'తరంగిణి కార్పొరేషన్' స్టీరియో రికార్డింగ్ థియేటర్‌లో ధ్వని ముద్రిక చేయబడింది. ఎస్. గోపాలకృష్ణ దర్శకత్వంలో శ్రీధర్, శరత్‌బాబు, ప్రసాద్‌బాబు, ఆనంద మోహన్, బేబీ రవి, హలం, జయమాలిని, డి. ఎస్. విజయతోపాటు కొందరు కొత్త నటీనటులు పాల్గొంటారు. మధురాధర్ రచయిత. సుఖదేవ్ ఛాయాగ్రాహకుడు. కూర్పు : రవి, రమణ. ప్రొడక్షన్ : శరభయ్య, శివద్వారకానాథ్. నిర్మాణ నిర్వహణ : కె. వెంకట్రావు.

'లాయర్ విశ్వనాథ్'లో
జయసుధ, ఎన్. టి. రామారావు





'రావణుడే రాముడైతే'లో కె. వి. చలం, జయచిత్ర, నాగేశ్వరరావు

# సినిమా విశేషాలు

## అక్కినేని వయస్సు 12 గంటలా !

డాక్టర్ అక్కినేని వయస్సు 55 సంవత్సరాలు కాదు 12 గంటలు అని ప్రేక్షక హర్షధ్వానాలమధ్య ప్రకటించారు యిటీవల నెల్లూరులో మన సత్యం. శ్రీ అక్కినేని 55 వ జన్మదినోత్సవ సందర్భంగా ప్రముఖ గాయని శ్రీమతి యస్. జానకిని నెల్లూరీయులు సత్కరించిన శుభసందర్భంలో ఉపన్యాసకుడిగా అక్కడికి వేంచేసిన మన సత్యం అక్కినేనిగారి వయస్సును గూర్చి మాట్లాడుతూ, ''ఈరోజు అక్కినేని పుట్టినదినం 55 వ జన్మదినం అనుకుంటున్నాము బాగానేవుంది. ఇపుడు సమయం 12 గంటలు దాటింది. అంటే నాగేశ్వరరావుగారు పుట్టి 12 గంటలైందనేగా. అందుకే వారి వయస్సు 55 వత్సరాలు కాదు 12 గంటలు అంటున్నాను'' అనేసరికి మరోసారి కరతాళధ్వనులు మిన్నుముట్టాయి. మీ ''శ్రీరామ రక్ష''లో ఎలా వున్నారు అని అడిగారట ప్రజలు. ''12 గంటల కుర్రాడిలా వున్నాడా లేక 12 ఏండ్ల కుర్రాడిలా వున్నాడో మీరే చూస్తారుగా. ఆ చూచే శుభదినం కూడా తొందరలోనే వుంది'' అన్నారట మన సత్యం.

## సత్యం జీవితాశయం

కీ॥ శే॥ శ్రీ గూడవల్లి రామబ్రహ్మంగారి జీవిత కథను వెండితెరమీద చూపించాలనేదే నా జీవితాశయం. ఎలాగైనా ఆ చిత్రం తీయాలనేదే నా తపన. డబ్బు సంపాదించాలనే ఆశతో కాదు, దండం సమర్పించాలనే కృతజ్ఞతా భావంతో'' అన్నారు ''శ్రీరామరక్ష'' నిర్మాత మన సత్యం.

## రాజమండ్రి సమీపాన విశ్వనాథ్ బృందం వేసిన షూటింగు క్యాంపు

విఖ్యాత చిత్ర నిర్మాత శ్రీ డి. వి. ఎస్. రాజు, దాసం గోపాలకృష్ణగారి ''ప్రెసిడెంట్ పెరిందేవి''ని రంగుల చిత్రంగా రూపొందించే బాధ్యతను, దర్శకుడు శ్రీ విశ్వనాథ్‌కు అప్పగించారు.

''ప్రెసిడెంట్ పేరమ్మ''గా రూపొందుతున్న యీ గ్రామీణ చిత్రానికి... తొలి షెడ్యూలు అక్టోబర్ 16 న ప్రారంభమైంది. ఎక్కడో తెలుసా ?

రాజమండ్రి సమీపాన గల కొర్పేడు ... ఎంకిపాడు ... జేవూరుపాడు గ్రామాలలో.

మొదటి షెడ్యూలులో ప్రధాన పాత్రధారిణి కుమారి కవితతో బాటు, నూతన్ ప్రసాద్, రాజబాబు, కె. వి. చలం, సాక్షిరంగారావు, భీమరాజు, రమాప్రభ ప్రభృతులుపాల్గొంటున్నారని, సహదర్శకుడు శ్రీ విజయ్ చెప్పారు.

ఇరవైరోజులు సాగే మొదటి షెడ్యూలులో (అక్టోబర్ 16 నుంచి నవంబర్ 4 వరకు) రెండు పాటల చిత్రీకరణ కూడా జరుగుతుందని, నిర్మాత శ్రీ రాజు తెలిపారు. ఈ చిత్రానికి చక్రవర్తి, రాము, కళాధర్, జి జి. కృష్ణారావు, పి. వి. రామారావు ముఖ్య సాంకేతిక సారథులు.

## రజనీ ప్రధాన పాత్రధారిగా శ్రీ పద్మావతీ యింటర్నేషనల్ కొత్త ప్రయత్నం

తెలుగు దేశంలో, నాగేశ్వరరావు ... రామారావు ... కృష్ణగార్లకు ప్రేక్షకులు ఎంత రిసెప్షన్ యిస్తున్నారో... రజనీకి కూడా అంత యివ్వడానికి సుముఖంగా వున్నారు గనుకనే, పరిశ్రమలో ఆయన విలువ విపరీతంగా పెరిగింది.

శ్రీ పద్మావతీ యింటర్నేషనల్ ఓ కొత్తతరహా సాంఘిక చిత్రాన్ని తలపెట్టినట్టు, ప్రధాన పాత్రధారిగా రజనీని ఎంపిక చేసినట్టు, నిర్మాత శ్రీ యు. సూర్యనారాయణబాబు తెలిపారు.

మీ చిత్రం పేరు, తదితర సాంకేతిక సారథులు చెప్పగలరా అని నిర్మాతను అడిగాము. చిత్రానికి ''బాలాజి'' అని పేరిడినట్టు, దర్శకత్వాన్ని రాజాచంద్ర నిర్వహిస్తున్నట్టు, సూర్యనారాయణ బాబు చెప్పారు.

డిశంబర్ ... జనవరి మాసాలలో చిత్ర నిర్మాణం పూర్తి అయ్యే ''బాలాజి'' చిత్రానికి జంధ్యాల రచనను, రాఘవులు సంగీతాన్ని, రఘు ఛాయాగ్రహణాన్ని నిర్వహిస్తున్నారు.

# మళ్ళీ మీ రోజువారీ పనులు మామూలుగా చేసుకోవాలని ఆత్రుతగా ఉందా మీకు?

# గ్లాక్సోస్-డి®

అలసటను ఎదుర్కొనేందుకు వెంటనే శక్తిని సమకూరుస్తుంది.

గ్లాక్సోస్-డి తో మీరు మామూలుగా మీ ఇంటి పనులు చేసుకునేందుకు సిద్ధం కావచ్చు. గ్లాక్సోస్-డి మీ శరీరానికి కావలసిన ముఖ్యమైన శక్తిని అందజేస్తుంది. డాక్టర్లచే సిఫారసు చేయబడుతున్న గ్లాక్సోస్-డి, విటమిన్ డి, కాల్షియం, భాస్వరంతో బలపరచబడిన హైగ్రేడ్ గ్లూకోజ్.

గ్లాక్సోస్-డి అలసటను దూరం చేసి మళ్ళీ మీరు ఇంటి పనులు మామూలుగా చేసుకొనేందుకు కావలసిన శక్తిని సమకూరుస్తుంది.

**గ్లాక్సోస్-డి®**

**కుటుంబానికంతటికీ ఇట్టే శక్తినిచ్చేందుకు.**



dCA/GL/54 TEL

# సినిమా

## ప్రతిభకు తగిన ప్రతిఫలం

ప్రతిభ వుంటే... ఆ వ్యక్తి ముమ్మాటికి రాణించడం తథ్యము అని, యువ రచయిత జంధ్యాల నిరూపించారు. ఇంతవరకు జంధ్యాల వ్రాసిన చిత్రాలలో, ఎనభై శాతం విజయాన్ని చవిచూడడం... గమనార్హం.

ప్రస్తుతం జంధ్యాలగారిని "గ్రేడ్ వన్ రైటరు"గా పేర్కొనగల "దమ్ము" యీ కలానికి వుంది. ఇప్పుడాయన వ్రాస్తున్న చిత్రాలు.

లారీ డ్రైవర్ రాముడు. రోస్ మూవీస్ చిత్రం. యువచిత్ర మలి చిత్రం. శ్రీ పద్మావతీ ఇంటర్నేషనల్ చిత్రం. నవత చిత్ర కొత్త చిత్రం.

## అనకాపల్లిలో పట్నంపిల్ల జాతర

"సెప్టెంబర్ 28, 29, 30 తేదీల్లో అనకాపల్లిలో ఓ పెద్ద అమ్మవారి జాతర జరిగింది.



'పట్నం పిల్ల'లో శ్రీదేవి, మురళీమోహన్

ఈ జాతరలో సినీ తారలు శ్రీదేవి, అనిత, సారథి పాల్గొన్నారు. దాదాపు ఓ ఇరవై వెరైటీ కార్యక్రమాలను (భజనలు, కోలాటం) ఈ సందర్భంగా ఏర్పాటు చేయడం జరిగిందట. వేలకొద్ది జనం ఈ జాతరను చూడడానికి వచ్చారట. పాపం! సినీ తారలు కాసేపు ఓపిక పట్టక తప్పలేదుట. మొత్తానికి మూడురోజుల్లో షెడ్యూల్ ప్రకారం షూటింగ్ చేసుకురాగలిగాము. ఈ సాంగ్‌తోబాటు ఓ 10 కామెడీ, విలన్ ట్రాకులు కూడా షూట్ చేశాము" అన్నారు ఉమాదేవి పిక్చర్స్ అధినేత, "పట్నంపిల్ల" చిత్ర నిర్మాత శ్రీ కె. తాతాజీ.

పట్నంలో పెరిగిన పిల్లలందరూ చెడిపోయిన వాళ్ళ అనే పల్లె ప్రజల దురభిప్రాయాన్ని పోగొట్టి, పట్నంపిల్ల పట్నంపిల్లేరా (తెలివిగా సమస్యలను పరిష్కరించడంలో) అని పదుగురిచేత ప్రశంసింపబడిన ఓ యువతి కథే మా "పట్నంపిల్ల" వర్ణ చిత్రం అన్నారు డైరెక్టర్ అండ్ ఎడిటర్ శ్రీ కె. సత్యం. మురళీమోహన్, కమల్‌హాసన్, శ్రీదేవి, సత్యప్రియ, మోహన్‌బాబు, మేడిశెట్టి అప్పారావు ముఖ్య పాత్రధారులీ చిత్రంలో.

## జయసుధ నెంబర్ వన్

తారకప్రభు ఫిలింస్ సినిమాస్కోప్ రంగులలో నిర్మించిన "శివరంజని" చిత్రం... నటిగా జయసుధను నెంబర్ వన్ స్థానానికి తీసికెళ్ళింది. శివరంజని చిత్రంలో జయసుధ ఎంతగా ఎదిగిందంటే... ఆమెలో ఒక సావిత్రిని... ఒక మీనాకుమారిని...ఒక సుచిత్రసేన్‌ను చూసినంతగా.

"శివరంజని" చిత్రంతో శ్రీ దాసరి "నెంబర్ వన్" అని మరోసారి ఋజువు చేశారు. ఆయన "శివరంజని" చిత్రాన్ని తీసిన విధానం... అపూర్వం.

ఒక సినిమా నటి జీవితాన్ని కథావస్తువుగా తీసుకుని... ఆ పాత్రకు ప్రేక్షకుల కన్నీటిబొట్లను రాబట్టడం... దాసరిగారి మేధాశక్తికి చక్కటి వుదాహరణం

## చంద్రకళకు స్వాగతం

"ఎంచక్కటి ఆర్టిస్టండీ చంద్రకళ" అని ఎందరిచేతనో అభినందింపబడిన చంద్రకళకు మొన్నమొన్నటి వరకూ చిత్రాలు లేవంటే నమ్మశక్యం కాకుండా వుంది. నటరత్న కథానాయకుడిగా నటించిన "సాహసవంతుడు" చిత్రంలో చంద్రకు చక్కటి పాత్ర దొరికింది. చక్కగా చేసిందికూడా. చంద్రకళ ప్రస్తుతం "ఎంకి—నాయుడుబావ", "రాముడు — రంగడు", "లారీ రాముడు" చిత్రాల్లో ముఖ్యమైన పాత్రలను పోషిస్తూంది. చంద్రా మళ్ళీ బిజీ అయ్యే సూచనలు కన్పిస్తున్నాయి.

## నవంబర్ 1 న నూతన్‌ప్రసాద్ !

1977 నవంబర్ 1 న పుట్టాడు నూతన్ ప్రసాద్. అంటే నూతన్‌ప్రసాద్ పుట్టి సంవత్సరమే అవుతూంది. మరి "చలిచీమలు" చిత్రంలో నూటొక్క జిల్లాలకు అందగాడిగా నటించిందెవరు? ఈ నూతన్‌ప్రసాదే.

## జ్ఞానోదయం

నూతన్‌ప్రసాద్ అసలు పేరు వరప్రసాద్. జీవితంలో ఏమీ సాధించలేకపోతున్నాననే బెంగతో రోజు రోజుకి కృంగిపోయేవాడట వరప్రసాద్. ఈ మానసిక సంఘర్షణవల్ల శారీరకంగా చాలా దెబ్బతిన్నాడట వరప్రసాద్. '77 అక్టోబరు 31 వ తేదీ హాస్పిటల్లో అడ్మిట్ అయ్యాడట. ఆ హాస్పిటల్ వాతావరణం, అక్కడి రోగుల వ్యాధుల లక్షణం చూచి వరప్రసాద్‌లో పరివర్తన కలిగిందట. గౌతమబుద్ధుడికి మర్రిచెట్టు క్రింద జ్ఞానోదయం అయినట్టు, వరప్రసాద్‌కు వైద్యశాలలో జ్ఞానోదయం అయిందట. "వేదవాక్కులే జీవితంకాదు. సాధన కూడా జీవితమే" అన్న కొత్త ఆశ చిగురించిందట చిటికెం వరప్రసాద్ మనస్సులో. ఆరోజు నుంచి వరప్రసాద్ పూర్తిగా మారిపోయాడు. ఆ మరుసటిరోజు అంటే నవంబర్ 1 వ తేదీనే నూతన్‌ప్రసాద్ పుట్టాడు.

## వ్యత్యాసం

వరప్రసాద్‌కు, నూతన్‌ప్రసాద్‌కు బోలెడంత వ్యత్యాసం వుంది. వరప్రసాద్ కోపిష్ఠి నూతన్‌ప్రసాద్ సాధువు. ఆవేదన, ఆందోళనలకు మిత్రుడు వరప్రసాద్. పట్టుదల, పరిశ్రమలకు ఆప్తుడు నూతన్‌ప్రసాద్. కానీ ఒక్క విషయంలో ఈ ప్రసాద్ లిద్దరూ స్నేహితులే. "ఈర్ష్య, అసూయ" ఈ రెండింటికీ బద్ధవిరోధులు వీరిద్దరూ.

"గత సంవత్సరం దీపావళి రోజున ఓ అయిదు రూపాయలకు టపాకాయలు కొని, మా ప్రాంతంలో వున్న ముష్టివాళ్ళందరినీ పిలిచి కాల్చమని చెప్పాను. ఈ సంవత్సరం కూడా అలాగే చేయాలనుకొంటున్నాను. ఇది గొప్పకోసం కాదు. నా తృప్తికోసం" అన్నారు కలియుగ దుర్యోధనుడు నూతన్‌ప్రసాద్.

## ముగ్గురు మూర్ఖురాళ్లు పార్టు - 2

లావణ్య పిక్చర్స్ అధినేత, రచయిత, నిర్మాత, దర్శకుడు శ్రీ మహేష్ "ముగ్గురు మూర్ఖురాళ్ళు" అనే హాస్యభరిత చిత్రాన్ని తీస్తున్న విషయం పాఠక విదితం. ఈ చిత్రం ఈ నెలాఖరులో విడుదలవుతుంది.

"ఫిబ్రవరి నుంచి "ముగ్గురు మూర్ఖురాళ్ళు" పార్టు — 2 తీయాలనుకుంటున్నాను. 45 రోజుల్లో పూర్తిచేయాలని వుద్దేశ్యం. ప్రతి నెల 15 రోజుల చొప్పున ఫిబ్రవరి, మార్చి, ఏప్రిల్ మాసాల్లో షూటింగ్ జరపాలనుకుంటున్నాను. ఈ పార్టు — 2 చిత్రానికి "ముగ్గురు మూర్ఖురాళ్ళు — తిరుపతి యాత్ర" అని పేరు పెట్టదలచాను. వాల్తేరులో బయలుదేరిన ఈ ముగ్గురు మూర్ఖురాళ్ల కథ తిరుపతిలో క్లైమాక్స్‌కు వస్తుంది" అన్నారు మహేష్.

# రూ. 100 విలువ చేసే సొగసుకు మీరిచ్చే వెల కేవలం రూ. 75

ప్రతిరోజూ ధరించేందుకు మీకు
నాణ్యతనిచ్చే బట్టలు కావాలి.
అలాంటప్పుడు, మదురా బట్టలను
మించినవే వుంటాయి గనుక.
ఇవి సరసమైన ధరలో దొరికేవి.
పైగా ఎంతో దర్జాగా
ఉంటాయికూడా!

## మదురా బట్టలు
### అందంగా, దర్జాగా!

పోలియెస్టర్ మిశ్రిత సూటింగులు మరియు షర్టింగులు, 100 % కాటన్ పాప్లిన్స్, డ్రిల్స్, గేబర్డిన్స్, టస్సార్స్, ఫుల్ వాయిల్స్, కేంబ్రిక్స్, ప్రింట్స్ మొదలైనవి. మీరు కోరుకునే రంగులో, తీరులో. అన్నీ సరసమైన ధరలోనే.

మదురా బట్టలు - తయారుచేయువారు :

## మదురా కోట్స్

304 TEL

మదురా సౌత్ ఇండియా కార్పొరేషన్ ప్రైవేట్ లిమిటెడ్ : 156, వన్నలత, విజయవాడ 520 001. మదురా సౌత్ ఇండియా కార్పొరేషన్ ప్రైవేట్ లిమిటెడ్ : 7-3-710 రాష్ట్రపతి రోడ్, సికింద్రాబాద్. శ్రీలక్ష్మి టెక్స్‌టైల్స్, బెసెంట్ రోడ్ గవర్నర్‌పేట, విజయవాడ 520 002.



'సీతాపతి సంసారం'లో చంద్రమోహన్, ప్రభ

## ఇది విన్నారా?

★ ''పొట్టేలు పున్నమ్మ'' తమిళ వర్షన్‌లో శ్రీప్రియ పాత్రకు జయచిత్రను, వన్నప్రియ పాత్రకు ఫటాఫట్ జయలక్ష్మిని అనుకున్నారట ముందు.

★ ఫటాఫట్ జయలక్ష్మి కళ్ళద్దాలు ధరించి ఒక్క చిత్రంలో అయినా నటించాలని ఆశపడిందట. ఆ ఆశ నెరవేరింది ఒక తమిళ చిత్రంలో. కానీ ఆ కళ్ళద్దాలు ధరించడం మూలాన తలనొప్పి వచ్చేసరికి ఎందుకాశపడ్డానా అనుకుందట.

★ హీరోయిన్ మంజుల తన భర్త విజయ కుమార్‌ని ''విజి'' అని పిలుస్తుందట. విజయ కుమార్ మంజులను ''ఏమ్మా! రామ్మా!'' అని పిలుస్తుంటారట.

★ నటి హేమాచౌదరికి పిచ్చిదానిగా నటించాలనే ఆశ వుందట. ఎప్పుడు నెరవేరుతుందో మరి.

★ వేద మంత్రాలపై నమ్మకంలేదనే లక్ష్మి వుంగరాలు మార్చుకుని మోహన్ను పెళ్లి చేసుకుందట. మరి ఈ నమ్మకం ఏమిటో!

★ కథానాయిక శ్రీప్రియ సోదరి కుమారి వైజయంతి శ్రీప్రియకు ముందే సినిమాల్లో ట్రై చేసిందట. ''అరంగేట్రం'' అనే బాలచందర్ గారి తమిళ చిత్రంలో చిన్న పాత్ర పోషించిందట. ఆ తర్వాత పెండ్లి చేసుకోవాలనుకుందట. కానీ ఇప్పుడు ''నియా'' అనే తమిళ చిత్రంలో నటిస్తూందట.

★ చక్కటి పాత్రలను పోషించాలనే ఆశతో తమిళ చిత్రరంగం ప్రవేశించిందట సత్యప్రియ. కానీ సెక్సు పాత్రలే వస్తున్నాయట. మారు మాట్లాడకుండా నటిస్తోందట. వాట్ ఏ పిటీ!

### పువ్వుల పున్నయ్యా పిక్చర్ల కథ

పువ్వుల పున్నయ్యగా ప్రజా హృదయాల్లో పదిలంగా నిలిచిపోయిన మాడా వెంకటేశ్వరరావుగారి పిక్చర్ల కథ చదవండి. బలేగమ్మత్తుగా వుంటుంది.

మాడాగారి మొదటి చిత్రం - అక్కినేనిగారి ''సుడిగుండాలు''

మాడాగారి నూరవ చిత్రం — అక్కినేనిగారి ''మంచిమనసు''

మాడాగారి మొదటి చిత్రం షూటింగ్ సారథీ స్టుడియోస్, హైదరాబాద్.

మాడాగారి నూరవ చిత్రం షూటింగ్ - అన్నపూర్ణా స్టుడియోస్, హైదరాబాద్.

మాడా మద్రాసులో ఒప్పుకున్న మొదటి చిత్రం — ఎన్. టి. ఆర్. గారి ''కులగౌరవం''

మాడా మద్రాసులో మొదట అడ్వాన్సు పుచ్చుకున్న చిత్రం — యం. యస్. రెడ్డిగారి ''ఊరికి ఉపకారి''

### ఆంధ్రప్రదేశ్ ఫిలిమ్ ఛేంబర్ అధ్యక్షుడుగా డి.వి.ఎస్. రాజు ఎంపిక

మన రాజధానిలో చలనచిత్ర పరిశ్రమ సమగ్రరూపం దాల్చడానికి అనుకూలించగల ఓ వ్యవస్థ ఏర్పడింది.

సెప్టెంబర్ 28న, భాగ్యనగరంలో మన నిర్మాతలు ... పంపిణీదారులు ... స్టుడియో ఓనర్లు ... చిత్ర ప్రదర్శనశాల యజమానులు సమావేశమై ''ఆంధ్రప్రదేశ్ ఫిలిమ్ ఛేంబర్'' అనెడి వ్యాపార సంస్థను నెలకొలిపారు.

ఈ సంఘానికి శ్రీ డి. వి. ఎస్ రాజు అధ్యక్షుడుగా (ఏకగ్రీవంగా) ఎన్నిక అయ్యారు. గౌరవ కార్యదర్శులుగా శ్రీ హరికృష్ణ... శ్రీ ఏ. గోపాలరావు, కోశాధికారిగా శ్రీ బాదం రామస్వామి ఎన్నుకోబడ్డారు.

ఈ నెల 27, 28, 29 తేదీలలో మన ప్రభుత్వంతో జరిగే చర్చలతో ... చలనచిత్ర పరిశ్రమకు సంబంధించిన అన్ని వ్యవహారాలు సానుకూలంగా ... సుముఖంగా వుండగలవన్న ఆశాభావాన్ని, శ్రీ డి. వి ఎస్. రాజు వ్యక్తపరచారు.

### చిత్రాల లెవల్స్

జానపద చిత్రాలు వరుసగా విడుదలై... ప్రేక్షకులలో విసుగును... విరక్తిని ఏర్పరచాయి. విడుదలయిన నాలుగు జానపదాలలో ... శ్రీ విఠలాచార్య చిత్రానికే ప్రేక్షకులు ఓటు వేసి గెలిపించారు.

ఇప్పుడు ప్రేక్షకులకు కావలసింది... మంచి కథ... మంచి సంగీతం... సభ్యత వున్న చిత్రీకరణ. అందుకే అన్నపూర్ణా కళానికేతన్‌వారి ''రాధాకృష్ణ'', తారకప్రభు ఫిలింస్‌వారి ''శివరంజని'', రాజలక్ష్మి ఆర్ట్ పిక్చర్స్‌వారి ''పదహారేళ్ల వయసు'', సమత ఆర్ట్స్‌వారి ''మల్లెపూవు'' చిత్రాలకు ప్రేక్షకుల అమోఘ ఆదరణ లభించింది.

### విడుదలైనవి 64; విజయాన్ని యిచ్చినవి 14

జనవరి నుంచి అక్టోబర్ 11 వరకు విడుదలయిన చిత్రాలు 64.

జనవరి 11న విడుదలయిన ''చిలిపి కృష్ణుడు'', అక్టోబరు 11న విడుదలయిన ''కటకటాల రుద్రయ్య'' ఘన విజయాన్ని సాధించాయి. ఈ రెండూ గాక మరో 12 చిత్రాలకు ప్రజాదరణ లభించాయి.

అన్నపూర్ణా కళానికేతన్‌వారి ''రాధాకృష్ణ'', వైజయంతి మూవీస్‌వారి ''యుగపురుషుడు'', సారథీ స్టుడియోస్‌వారి ''అన్నదమ్ముల సవాల్'' చిత్రాలు... విజయాన్ని సాధించాయి.

''మరో చరిత్ర ... బొమ్మరిల్లు... పొట్టేలు పున్నమ్మ ... శివరంజని ... సీతామాలక్ష్మి'' చిత్రాలకు అనూహ్యమైన ఆదరణ లభించింది.

''రామకృష్ణులు'' చిత్రానికి వసూళ్లు ఉత్సాహకరంగా వచ్చాయిగాని... చిత్రం గూర్చి ఎక్కువ విమర్శలు వచ్చాయి.

''వయసు పిలిచింది'' చిత్రానికి, ''పదహారేళ్ల వయసు'' చిత్రానికి స్టడీ కలెక్షన్లు వచ్చాయి.

సత్యచిత్ర వారి ''కుమారరాజా'' చిత్రానికి మంచి కలెక్షన్లు వచ్చాయి.

అయిదారు చిత్రాలకు ''టాక్'' ఆశాజనకంగా వచ్చినా... ఆర్థికంగా షుమారుగా కలెక్ట్ చేశాయి.

64 చిత్రాలకు... 14 విజయాన్ని పొందాయి అంటే ఫెయిల్యూర్ శాతం ఎంతో తెలుసా? 68 శాతం. అంటే మన తెలుగు చిత్ర రంగానికి కొన్ని కోట్లు నష్టం వచ్చిందన్న మాటేగా!

### విడుదల రద్దీ తగ్గాలి

వారానికి మూడు లేక నాలుగు చిత్రాలు విడుదల గావడం...పరిశ్రమ మనుగడకే ''ముప్పు'' అని నిర్మాతలు గ్రహించాలి.

లక్షలకు లక్షలు వెచ్చించి, భారీ చిత్రాలను నిర్మించి ... ఆయికమత్యహీనత కారణంగా చిత్రాలను విచ్చలవిడిగా విడుదలచెయ్యడం... పరిశ్రమపై ''గొడ్డలిదెబ్బ'' అని నిర్మాతలు గ్రహించాలి.

వారానికి ఒక చిత్రాన్ని విడుదల చెయ్యాలి అనెడి సముచిత నిర్ణయాన్ని తీసుకుంటేనేతప్ప... మన పరిశ్రమ వర్ధిల్లదని నిర్మాతలు గ్రహించాలి.

— జనప్రియ ★

హైదరాబాద్ సినిమా

# వాణిశ్రీ కొత్త అనుభవం

'ఈ క్రయుద్ధాలు వుండే చిత్రాలకు యిక ఒప్పుకోకూడదు బాబూ, యింకే స్టంటు అయినా పరవాలేదుగాని యిందులో ఏమాత్రం దెసిగినా పోట్లాడేవాళ్లందరికీ అపాయమే,' అన్నారు వాణిశ్రీ ముఖాన పట్టిన చెమటను రుమాలుతో అద్దుకుంటూ వచ్చి.

అంతకుముందు ఆమె బాణాకర్ర పుచ్చుకుని ముగ్గురు 'ముష్కరుల'తో పోరాడి, లాఘవంగా వారిని తరిమికొట్టారు. ఫైట్ కంపోజర్ ఎం. ఎస్. దాస్ చెప్పిన ప్రకారం తు. చ. తప్పకుండా చేశారు.

వెంకటేశ ఎంటర్‌ప్రయిజెస్ పేరిట డి. రామానాయుడు తీస్తున్న 'ఎంకినాయుడుబావ' క్లయిమాక్స్ దృశ్యాలలో యిదొకటి. ఆరోజు తీసిన దృశ్యాలలో శోభన్‌బాబు, చంద్రమోహన్, కాంతారావు, ప్రభాకరరెడ్డి, రావుగోపాలరావు, అల్లురామలింగయ్య, మాదాల రంగారావు, అర్జా జనార్దనరావు నటించారు.

యువ దర్శకుడు బోయిన సుబ్బారావు, ఛాయాగ్రాహకుడు సుందరం వారి వారి పనులలో నిమగ్నులయివుండగా, రికామీగా వున్నవారు ఎడంగా అక్కడక్కడ చెట్లనీడనా, వరండాలలోనూ కూచుని ఆషామాషీ సాగించారు.

ఒకచోట 'నిరంతర' నిర్మాత రామానాయుడు సురేష్ ప్రొడక్షన్స్ పేర డిసెంబరులో ప్రారంభించనున్న 'శాంతినికేతన్'లో కొన్ని దృశ్యాలను అందులో నాయక పాత్ర వహించనున్న శోభన్‌బాబుకి చెపుతున్నారు — ఆసక్తికరంగా — మోదుకూరి జాన్సన్ వ్రాసిన సంభాషణలతోసహా. ఏ వేషానికి ఎవరు బాగుంటారోకూడా సంప్రతించుకుంటున్నారు. జమున, జగ్గయ్యల పేర్లు నా చెవిని పడ్డాయి.

మరొకచోట రామలింగయ్య, గోపాలరావు హోమియో వైద్యం గురించి మాట్లాడుకుంటున్నారు. ఇంకోచోట అర్జా, మాదాల కబుర్లాడుకుంటున్నారు. కాంతారావు ఆ పక్కనే నడుంవాల్చి వాణిశ్రీ తెచ్చుకున్న 'గ్లామర్‌లెస్ గరల్' అనే పుస్తకం చదువుతున్నారు.

అంతలో చిరుతిండికి బిస్కెట్లు వచ్చాయి. ప్లేటులో పోసినవి తలా రెండు, మూడు తీసుకుంటుంటే చంద్రమోహన్ ఒక అర పాకెట్ కొట్టేశారు. ఒకటో రెండో నోట్లో వేసుకునేసరికి 'సీను'లోకి పిలుపు వచ్చింది. పాకెట్ ఎవరు దాచిపెడతారు అని ఆయన అనగా, తాము దాచిపెడతామన్నారు కాంతారావు. 'మానాయనే నాకు కాగితం మిగిల్చేందుకా,' అని నవ్వుతూ 'నీదగ్గర వుంచరా' అని శోభన్ చేతి కిచ్చారు.

అంతికి కొంచెం ముందు బంగళా వసారాలో రామలింగయ్య, గోపాలరావు, ప్రభాకరరెడ్డి, కాంతారావు, వాణిశ్రీ ఇష్టాగోష్ఠి సాగించారు ఎట్లాగో, ఎందుకో స్వర్గీయ పి. పుల్లయ్య; వారి కుమారుడు సి. ఎస్. రావు స్వభావాల గురించీ, వారి డైరెక్షన్ గురించీ ప్రస్తావన వచ్చింది. ఒక్కొక్కరు వివరించిన అనుభవాలు వింటూంటే వీరికి ఆ ఇరువురిపై విశేష గౌరవాభిమానాలున్నవని విదితమయింది.

భోజనాల దగ్గర గోపాలరావు కబుర్ల కమ్మదనం శాకపాకాల రుచులను మరిపించింది. మంది ఎక్కువయితే మజ్జిగ పల్చన అని గాబోలు అల్లువారు ముందుగానే ఒక సీసా 'చల్ల' రిజర్వు చేసుకున్నారు. మరొక విశేషం ప్రభాకరరెడ్డి శాఖాసంక్రమణం. శాకాహారుల సరసన చేరారు. గురువాయూర్ అయ్యప్ప దర్శనానికి వెళ్ళేముందు ప్రతి యేడూ ఈ దీక్షలో వుంటారట. స్టేట్ ఎక్స్‌ప్రెస్ సిగిరెట్లకు అయే ఖర్చు కూడా బోలెడు ఆదా.

జయప్రదా కంబైన్స్ పేర తాము తీసే చిత్రం పేరు 'ఇల్లాలి ముచ్చట్లు' అని ప్రభాకర రెడ్డి చెప్పారు శోభన్, జయప్రద ప్రధాన పాత్రలు వహించే ఈ చిత్రానికి రచన — ముద్దిపట్ల సూరి, సంగీతం — సత్యం, దర్శకత్వం — లక్ష్మీదీపక్ నిర్వహిస్తారట.

ప్రొడక్షన్ మేనేజరు మొహిద్దీన్ సాహెబ్ వీడ్కోలు వాక్యాలతో మా కార్యక్రమం ముగిసింది.

## చిలకమ్మ... నిర్మాతల రెండవ చిత్రం

'చిలకమ్మ చెప్పింది' అనే చక్కని చిత్రాన్ని నిర్మించిన గోపీకృష్ణ ఇంటర్నేషనల్‌వారు అక్టోబరు 4 న తమ రెండవ చిత్ర నిర్మాణం ప్రారంభించారు. ఆరోగ్య మంత్రి మదన్‌మోహన్ చేత కామెరా స్విచ్ ఆన్ చేయించారు — యీ చిత్రానికి కూడా స్క్రీన్‌ప్లే వ్రాసి, దర్శకత్వం వహిస్తున్న ఈరంకి శర్మ, తొలి షాట్ 'నాలాగ ఎందరో'లో తండ్రి పాత్రను అద్భుతంగా పోషించిన హేమసుందర్‌పై తీశారు.

చలసాని గోపి నిర్మించే, చేగొండి హరిబాబు సమర్పించే ఈ చిత్రం మూల కథా రచయిత చివుకుల పురుషోత్తం మాటలు — సి. ఎస్. రావు. పాటలు — ఆత్రేయ. సంగీతం — ఎం. ఎస్. విశ్వనాథన్ కామెరా — లోకనాథ్, రఘునాథరెడ్డి.

హైదరాబాద్ నగరం కథా స్థలంగా కలిగిన ఈ చిత్రంలో మాధవి, పల్లవి, నారాయణరావు, చిరంజీవి, లక్ష్మీకాంత్, పి. ఎల్. నారాయణ, రాళ్ళపల్లి, వంకాయల, శ్రీమతి మల్లాడి, జానకి, రజని, హంస ప్రభృతు లున్నారు.

తొలి షెడ్యూలు షూటింగులో 'ఏమండీ, ఏమనుకోకండీ ! ఆకుచాటు మొగ్గనూ, రేకువిడని పూవునూ ... జీవితంలో ఏమీ ఎరుగనూ కాగితంలో ఏమి వ్రాయనూ...' అని నాయిక నాయకుని ఉద్దేశించి వ్రాస్తూ పాడే భావయుక్తమైన పాట చిత్రీకరించబడింది

— ఎం. ఎస్. శర్మ



ఈరంకి శర్మ ప్రతిభావంతమైన దర్శకత్వాన 'నామాల తాతయ్య'లో రంగనాథ్, జయ

(గత సంచిక తరువాయి)


అరణ్యమున హిడింబుడు అను రాక్షసుడు తన చెల్లెలితో.........
హిడింబా! ఎవరో మానవులు మన అరణ్యమున నిర్భయముగ నిదురించుచున్నారు! నీవు పోయి వారిని చంపి తెచ్చి రుచిగ వండి పెట్టుము.
అలాగే! అన్నయ్యా!


అంత హిడింబ పాండవులున్న చోటుకు వచ్చి........
1-120
ఆహా! ఎవరీ మానవుడు!! ఎంత సుందరుడు!... వీనిపై నాకు మోహముంకురించినదే! కామరూపమున మానవస్త్రీ రూపము దాల్చి ఈతని దగ్గరకు పోయెద.


ఎక్కడి దానవు? ఇంతప్రొద్దుపోయి ఎలవచ్చితివి? వెంటనే పొమ్ము.
నేను హిడింబుడను రాక్షసుని చెల్లెలను నిన్ను మోహించి... వచ్చితిని...


బాలా! నీమాట విని, తల్లిని, తోడబుట్టినవారిని అపాయమునకు వదలి నీతో వచ్చునంతటి మూర్ఖుడను గాను....
నీవు నాకు పతివై నన్ను స్వీకరించిన యెడల మా అన్న వలన నీకు ప్రమాదము రాకుండ తీసికొని వెళ్ళి, కాపాడెదను..........


ఓసీ! హిడింబా! .... భ్రాతృఘాతుకురాలా! నా పని మాని, ఆ నీచ మానవునితో నుంటివా?
అమ్మో!.... మా అన్న.... ఏమి చేయుదును....
హిడింబా! నీ యన్న నే గతి యమపురి కంపెదనో చూచెదవుగాక!
1-121


భీముడు తన వారికి నిద్రాభంగము కలుగకుండ హిడింబాసురుని పట్టి అల్పమృగమువలె వానిని దూరముగ ఈడ్చుకొని పోయెను


భీమ హిడింబులకు భయంకరమైన మల్లయుద్ధము జరిగెనది. అంత హిడింబుడు భీముని చిక్కబట్టి...


ఏమిటా! వికటాట్టహాసము!
అసురుని కేకవిని ధర్మజాదులు కలవరపడి లేచి హిడింబవలన అంతయు తెలిసి, వారున్న వైపు బయలుదేరిరి.
1-122


వారి యుద్ధము చూచి అర్జునుడు...
అన్నా! దుష్టనిశాచర వేళ అగుచున్నది. జాగు సేయక వానిని తెగటార్చుము


భీముడు హిడింబాసురుని కాలు పట్టుకొని నూరుసారులు గాలిలో గిరగిర త్రిప్పి పడవైచెను. ఆ రక్కసుడు ముక్కునుండి రక్తము గ్రక్కుచు, స్పృహతప్పి పడెను. అప్పుడు భీముడు వానిని జెక్కపట్టి, నేలబెట్టి నడుమునకుద్రుంచి విచిత్రవధ చేసెను.
[ఇంకా వుంది]
1-123

## ధర్మపథం

# సర్వసమానత

ప్రపంచంలో ఏ దేశం చూచినా సరే మానవులలో వారి ప్రవర్తనను బట్టి వ్యత్యాసం కానవస్తున్నది. మన దేశంలో జాతిమతాల వ్యత్యాసాన్నిబట్టి సంక్షోభం సంభవిస్తున్నది. ఇట్టి వ్యత్యాసం అనాగరకమనీ, అజ్ఞానంవల ఏర్పడేదనీ పాశ్చాత్యులు భారతీయుల్ని ఆక్షేపిస్తారు. వారిదేశాలలో జాతిమత వ్యత్యాసం లేకపోయినా ధనిక దరిద్ర భేదం, రంగుభేదం ఉండనే ఉన్నది. ధనికులు దరిద్రులనూ, తెల్లవారు నల్లవారినీఅస్పృశ్యులుగానే భావిస్తూ ఉంటారు.

ఇంతతోపోలేదు. ప్రతిజాతిలోనూ, ప్రతి మతంలోనూ కూడా మంచీ, చెడ్డా భేదం ఉన్నది. ధనికుల్లోనూ, దరిద్రుల్లోనూ, నల్లవారిలోనూ, తెల్లవారిలోనూ కూడా ఈ మంచి చెడ్డల భేదం ఉంటున్నది. సృష్టిలో అందరూ సమానంగా ఉన్నా వారి వారి పూర్వ జన్మ కర్మల మూలంగా ఇలాటి వ్యత్యాసం కలుగుతున్నదని విజ్ఞుల అభిప్రాయం. అంతేకాదు. పరిసర ప్రభావం వల్ల కూడా ఇట్టి వ్యత్యాసం కలగడం ప్రత్యక్షంగా మనకు గోచరిస్తుంది. "ఆరు నెలలు సహవాసం చేస్తే వారు వీరవుతా" రనే లోకోక్తి ఉన్నది. సహవాసంవల్ల మంచి వారు చెడ్డవారుగానూ, చెడ్డవారు మంచి వారుగానూ మారుతారని దీని అభిప్రాయం. మంచివారు చెడ్డవారుగా మారడంసులభం. కాని మంచివారి సహవాసంవల్ల చెడ్డవారు మంచిగా మారడం అంత సులభంకాదు. ఇందువల్లనే ఎల్లపుడూ సత్సాంగత్యం కోసం సర్వవిధాలా యత్నించాలని చెప్తూనే ఉంటారు.

మానవులలో ఉండే ఈ వ్యత్యాసం ఎలా పోతుంది ? ఇదిత్రీవంగా ఆలోచించదగిన విషయమే! మతకలహాలేర్పడినప్పుడు ఆయా మతాల పెద్దలు ప్రయత్నించి శాంతిని కలిగించవచ్చు. కాని అది తాత్కాలికమే! ఆర్థికంగా దరిద్రులకు తోడుపడి, సదుపాయాలు కలుగజేసికొంత ప్రశాంతిని కలిగించినా, కొద్దిరోజులు పోయాక మళ్ళీ సంక్షోభం బయలుదేరుతుంది. మనం చూస్తున్న సమ్మెలే దీనికి తార్కాణం.

అయితే—ఆధ్యాత్మిక దృష్టివుంటేనేగాని సర్వమానవ సమత ఏర్పడదు. ఆధ్యాత్మిక దృష్టి అలవరచుకొన్నవారికి ఎక్కువతక్కువ వ్యత్యాసం ఉండదు. సర్వజనులయందును ఉన్న జీవుడు ఒక్కడే అనే తత్త్వం తెలిసినందున అందర్నీ సమానంగానేచూస్తారు. దేశంలో ఇట్టి సంక్షోభం లేకుండా ఉండడానికి ఆధ్యాత్మిక దృష్టి ఎంతో అవసరం.

—*బులుసు వేంకటరమణయ్య.*




**సి. హెచ్. డి. కడప**

నాకు చిన్నప్పటినుంచి చెవులోచీముపస్తున్నది. ఎన్నిమందులు వాడినను తగ్గలేదు. మందువాడినపుడు 15 రోజులుపాటు చీము రాకుండావుండి మరల వస్తుంది.

చెవులలో నుండి చీము చాలా రోజులుగా రావటాన్ని "క్రానిక్ సప్యురేటివ్ ఓటైటిస్ మీడియా" అంటారు చెవులలోనిమధ్య భాగములో చీము చేరటంవల్ల ఇలా జరుగుతుంది. ఎక్కువ రోజులుగా వున్నప్పుడు చెవుల వెనుకభాగములోని మాస్టాయిడ్ అనే ఎముకను ఈ చీము విస్తరించి నిరంతరం చీము కారటం జరుగవచ్చు.

చీమును పరీక్ష చేసి యాంటిబయాటిక్ సెన్సిటివిటీ టెస్టు తర్వాత మందులు వాడితే తిరిగి రావటానికి అవకాశం తక్కువ. చెవులలో మందు వాడటమే కాక మాత్రల ద్వారా లేక ఇంజక్షనుల ద్వారా కూడా యాంటిబయాటిక్‌లను వాడటం అవసరం.

**ఎస్. టి. ఎల్. తిరుచ్చి**

"సెరిబ్రల్‌పాల్సీ" అంటే ఏమిటి? అది ఎందువల్ల వస్తుంది? ఈ జబ్బు వచ్చినపుడు ఏమి చెయ్యాలి?

ఈ జబ్బు మెదడులోని సెల్స్ దెబ్బతినటం వల్ల వస్తుంది. ఈ రోగం పుట్టక ముందు, తర్వాత కూడా పిల్లలకు సంక్రమించ వచ్చును. మెదడు పూర్తిగా వృద్ధికాక ముందు ఎన్నో కారణాలవల్ల ఈ రోగంవచ్చే అవకాశము వున్నది. శిశువు జన్మించేటప్పుడు అసాధారణమైన ఆలస్యము, తల్లి గర్భవతిగా వున్నప్పుడు రాగల "టాక్సీమియా," మెదడుకు దెబ్బతగలటం, మెదడుమీద పొర వాయటం, మున్నగువాటివల్ల ఈ రోగం సాధారణంగా వస్తుంది.

ఈ రోగం వున్న పిల్లలకు చేతులు, కాళ్ళు బిగుసుకొని, గ్రహణశక్తి లోపించి వుంటుంది. ఈ పిల్లలకు ఓపికగా ఆహారం ఇవ్వటం,వైద్యుల సలహాపై వ్యాయామం చేయించటం ముఖ్యం. వీటితోపాటు అంటువ్యాధులు రాకుండా జాగ్రత్త పడటం, పిల్లలకు మానసికరుగ్మత రాకుండా చూసుకోవటం ఇతర్రా తీసుకోవలసిన జాగ్రత్తలు.

**ఎం. ఎస్. ఎన్. అమలాపురం**

మా పాప వయస్సు 3 సం॥లు కొద్దిగాదెబ్బ తగిలినా క్రిందపడినా 5 నిముషముల వరకూ వూపిరి తిప్పుకోలేదు. గుడ్లుతేలవేసి ఒళ్ళంతా నల్లబడుతుంది.

ఈ రోగాన్ని "బ్రెత్‌హోల్డింగ్ స్పెల్స్" అంటారు. ఈ రోగం మానసిక ఆందోళనను తెలియజేస్తుంది. దీనినే మనలో కొందరు చిన్నబిడ్డగుణం అని గూడా అంటారు. ఈ రోగానికి ఎక్కువగా శ్రద్ధచూపనవసరంలేదు. 6 సం॥ల వయస్సువచ్చేలోగా తగ్గిపోతుంది. పిల్లలను ఎగరవెయ్యటం మొదలైనవి అనవసరం. కొంచెము సేపటికల్లా మామూలుగా అవగలుగుతారు. దెబ్బలు తగులకుండా చూచుకోవటం, పిల్లల దృష్టి ఆటల మీదికి మళ్ళించటము, పిల్లలకి మానసిక వ్యధ రాకుండా చూచుకోవటం. ఇలా తరచూ రాకుండా చూచుకోతగిన జాగ్రత్తలు.

**ఆర్. ఆర్. ఆర్. పత్తేవారిపాలెం**

మా తమ్ముడికి 10 సంవత్సరములు. చాలా రోజుల నుంచి పనిచేసినా, నడచినా ఎక్కువగా ఆయాసం వస్తోంది. కొంచెంసేపటికితగ్గుతుంది.

పనిచేసినపుడు ఆయాసం రావటాన్ని "ఎక్సర్షనల్ డిస్నియా" అంటాడు. దీనికి హృదయము, వూపిరితిత్తులు, వీటిలో మార్పులు ముఖ్యకారణాలు. పుట్టినప్పటినుండీవుండేహృద్రోగములు (కన్ జెనిటల్ హార్ట్ డిసీజ్) వూపిరితిత్తులలో "క్రానిక్ బ్రాంకైటిస్", ఎంఫైసిమా మొదలగు రోగాలు వుండటంవల్ల ఆయాసంగా వుండవచ్చును.

వైద్యపరీక్ష, ఎక్సరే. ఇ.సి.జి. మున్నగువాటి వల్ల రోగ నిర్ధారణ అవుతుంది. జబ్బుని బట్టి వైద్యం నిర్ణయించాలి.

—డా॥ కె. వెంకటేశ్వరరావు




# రమా నేనూ సరోజా

పి.వి. సూర్యనారాయణమూర్తి

రాత్రి ఎనిమిది గంటలయింది.

పాండీ బజారులో ఓ హోటలులో భోజనం చేసి బయటకొచ్చాను కిళ్లీ నములుతూ బస్సు స్టాపులో నిలబడ్డాను. శీతాకాలపు చలిగాలి శరీరంలో చలినీ, ఆలోచనల్లో వేడినీ రేకెత్తిస్తోంది. రోడ్డుమీద వెళ్లే కార్లను చూస్తూ వాటిలోని అందాలను కళ్లతో ఆస్వాదిస్తూ, నేను ఎక్కవలసిన బస్సుకోసం ఎదురు చూస్తున్నాను

చేతిలో ఉన్న ప్లాస్టిక్ కవరులోంచి అంతక్రితమే కొన్న కొత్తచీర పైకి తీసి ఓ సారి చూసుకున్నాను. "సరోజ ఈ చీరలో ఎంత బాగుంటుందో!" ఆలోచనలు సరోజమీదకీ, పిల్లలమీదకీ సాగాయి. బహుశా ఈపాటికి అందరూ అన్నాలు తినేసి పడుకుని ఉంటారు. నాలాగే సరోజ కూడా ఈ 'క్యాంపు'ల ఉద్యోగాన్ని తిట్టుకుంటూ ఉంటుంది.

హాయిగా; కడుపులో చల్ల కదలకుండా గడిపాను– స్వంతంగా 'టైపు ఇన్స్టిట్యూట్' నిర్వహించినన్నాళ్ళూ. ఆరోజులు ఎంత సుఖంగా ఉండేవి! అయితే అప్పట్లో ఒకటే ఇబ్బంది ఉండేది– నికరమైన ఆదాయమంటూ లేకపోవడం! ఆర్థికంగా కొన్ని ఇబ్బందులు పడ్డా, ఈ హైరానకంటే అటువంటి స్వతంత్ర జీవితమే మంచిదనిపిస్తోంది, ఇప్పుడు.

నా దగ్గర టైపు, షార్టుహేండు, నేర్చుకోవడానికి వచ్చిన విద్యార్థులంతా నేనంటే ఎంతో గురీ, ఆరాధనా భావం వ్యక్తపరచేవారు! "ఆరాధన!" ఈ మాట నా మనసులోకి రాగానే హఠాత్తుగా 'రమ' జ్ఞాపకం వచ్చింది.

"రమ!" కొన్ని మాసాలు నాలో విపరీతమైన సంచలనం సృష్టించిన పేరు. మొదటిసారి ఆమె నా ఇన్స్టిట్యూట్‌లో చేరటానికి వచ్చినపుడు ఆమెమీద నుంచి కళ్ళు తిప్పుకోలేక పోయాను. స్ప్రింగ్ బ్యాచ్! కొన్నాళ్ళు గడిచాక, నా పరిచయం పెంపొందించుకోడానికీ, ఆమె దృష్టిని ఆకర్షించడానికీ నేను చేయని ప్రయత్నం లేదు. పోతే, ఎంతో తెలివిగా ప్రవర్తించేవాడిని. ఎక్కడా బయట పడలేదనే నా నమ్మకం.

ఆమెను ఒక అపూర్వమైన అందగత్తెగా నేను గుర్తించినట్లు అనేకసార్లు మాటల్లో వ్యక్తపరచేవాణ్ని. అందుకామె సంతోషించినట్లే కనిపించేది కూడా! కాని నా "గురుస్థానం" వల్ల, నా వాంఛలను ఆమెకు వెల్లడించే అవకాశం ఎప్పుడూ రాలేదు

సరోజతో పెళ్లి అయాక. 'రమ'ను ఇంచుమించు మర్చిపోయాననే చెప్పాలి. కాని, ఎప్పుడయినా, 'అందమైన ఆడది' అన్న పదానికి నా మనసులో రూపం ఇవ్వాలంటే, అది 'రమ' రూపమే అయ్యేది ఈ ప్రభావం నుండి మాత్రం నేను తప్పించుకోలేక పోయాను.

* * *

నాకు అతి సమీపంలో 'ఆటోరిక్షా' ఆగింది. అందులోంచి దిగి నావైపే నడిచి వచ్చేది–ఆశ్చర్యంతో కళ్ళు వెడల్పు చేసుకుని చూశాను– ఆమె 'రమ !'

మనిషి ఆలోచనలకు కూడా ఏదన్నా విద్యుదయస్కాంత ప్రభావం ఉండి, ఆమె అక్కడ ప్రత్యక్షమైందా! లేకపోతే ఇది ఎంత యాదృచ్ఛికం!

"నమస్తే మాస్టారూ!" ఆమె నవ్వుతూ నా దగ్గర కొచ్చింది.

"హలో! రమాదేవి! ఇటీజ్ ఏ ప్లెజంట్ సర్‌ప్రైజ్" అన్నాను.

ఇద్దరమూ ఆ సమయంలో అక్కడ

ఉన్నందుకు గల కారణాలను విశదీకరించుకున్నాం.

"అంటే చదువు మానేసి సినిమాల్లో చేరావన్నమాట. ఏ సినిమాల్లో వేశావు ?" నేను చూసిన సినిమాల్లో ఎక్కడా ఆమెను చూసిన గుర్తు లేదు చూస్తే అప్పుడేగుర్తు పట్టేవాడిని !

"కాస్త చెప్పుకోదగ్గ వేషం వేసింది మొదటి సినిమాలోనే. కాని అది 'ఫ్లాప్' అయింది ఆ తర్వాత ఎంచుమించు ఏమీ లేనట్లే." అంది నవ్వుతూ ఆ మాటల్లో బాధ ఏమీ వ్యక్తం కాలేదు

"అలాగా! ఎందుకటా జరిగింది ?" కాస్త సానుభూతి చూపుతూ అడిగాను.

"బాధపడ్డానికేమీ లేదు లెండి. నా ముఖంలో అందాన్ని పూర్తిగా గ్రహించేశక్తి వాళ్ల కెమెరాలకు లేదుట. ఏదో 'ఫోటో జెనిక్' అంటారు చూడండి. అదీగాక, నేను అనుకున్నంత నటనా ప్రతిభ నాకు నిజంగా లేకపోవడం మరోకారణం."నిజాన్ని అంత నిర్భయంగా ఒప్పుకోవడంలోనూ, హాస్యంగా మాట్లాడ్డంలోనూ ఆమెకంత శక్తి ఉందని తెలీదు నాకు.

ఆమే, మళ్ళా, "అయినా, ఇతర భాషల సినిమాలలో కాస్త మంచి వేషాలే వస్తున్నాయిలెండి" అని, ఆ సంభాషణకు ముగింపుగా,

"అవునూ, మీరు ఎక్కడికి వెళ్లాలి? మా యింటికి రాకూడదూ?" అడిగింది.

"తప్పకుండా! కాని మీ ఇల్లు ఎక్కడ? ఎప్పుడు రమ్మంటావు?"

"ఎప్పుడో ఎందుకు? ఇప్పుడే రండి" నేను ఆశించని ఆ చనువుకు ఆశ్చర్యపడాలో ఆనందపడాలో తెలీలేదు.

"ఈమె నాకు పూర్వం తెలిసిన 'రమ' యేనా! ఇంకా పెళ్ళియిందో లేక ఒంటరిగానే ఉంటోందో! ఇంత రాత్రివేళ ఒక ఆడపిల్ల మగవాణ్ణి ఆహ్వానించడంలో అర్థం ఏమిటి?" అనుకున్నాను. మరికాస్త ఆలోచిస్తే అంత ఆశ్చర్యపడవలసినదేదీ అందులో లేదనిపించింది. ఆమె సినీ ఫీల్డులో పనిచేస్తోంది. మగవారితో 'సోషల్'గా ఉండడం అలవాటు అయి ఉండవచ్చు. అంత మాత్రంచేత నేను ఇలా ఆలోచించడం మంచిదికాదు– అని సమర్థించుకున్నా, నాకేదో 'శుభముహూర్తం' ఉందేమోనన్న ఆశ మాత్రం లోపల కలగసాగింది.

ఇలా నేను ఆలోచిస్తున్నంతలో, ఆమె 'టాక్సీ' పిలిచింది. యాంత్రికంగా ఆమెను అనుసరించాను.

* * *

'తేనాంపేట'లో చిన్న డాబా యిల్లు. కనీసం మూడు, నాలుగు వందలయినా అద్దె ఉంటుందని అంచనా వేశాను. ఇంట్లో ఆమె తల్లి, చిన్న తమ్ముడు ఉన్నారు. తల్లికి నన్ను పరిచయం చేసింది.

"చాలా సంతోషం బాబూ! రండి" ఆహ్వానించింది ఆమె.

తనతో నన్నుకూడా భోజనం చేయమంది. నా భోజనం అయిపోయిందని ఆమెనునమ్మించడం మహా కష్టమయింది.

"ఆయితే నేను తిన్నంతసేపూ సాయం కూర్చోండి" అంటూ నన్నూ తన ప్రక్కన కూర్చోబెట్టుకుంది. ఆమె చూపుతున్న ఆ చనువూ, ఆప్యాయతా, నన్ను ఊహా ప్రపంచంలో ఎంతోఎత్తున విహరింపచేస్తున్నాయి.

ఆమెకు అన్నం వడ్డించి, ముసలామె వెళ్ళి పడుకుంది.

ఇద్దరమూ మధ్య గదిలో కూర్చొని కాస్సేపు కబుర్లు చెప్పుకున్నాం. నా సంసారపు విషయాలు అడిగింది. ఆసక్తిగా వింది. తన సినిమా విషయాల గురించి మాత్రం కాస్త అనాసక్తంగా జవాబులు చెప్పింది.

"నా మాటలతో మీకు విసుగెత్తించడం లేదుగదా! మీకు ఎప్పుడు నిద్రవస్తే అప్పుడు చెప్పండి - పిధి గదిలో పడుకుందురుగాని" అంది కాస్సేపయిన తర్వాత.

"అబ్బే! తొందరేమీ లేదు నా నిద్రకి" అన్నాను.

"ఆయితే కాస్సేపు పేకాడుకుందామా?" తలూపాను. ఆమె పేక తేవడానికి వెళ్లింది. నేను తెచ్చిన చీర పార్శెల్ చేతిలోకి తీసుకున్నాను. ఆమె రాగానే–

"రమా! నువ్వేమనుకోకపోతే, ఈ చీర తీసుకో" నా గొంతులో కొంచెం వణుకు, గుండె వేగంగా కొట్టుకోవడం, నాకే తెలుస్తున్నాయి. నేనేదో తప్పు చేస్తున్నానన్న నా 'ఫీలింగ్' ఆమె తప్పకుండా గమనించే ఉంటుంది.

"ఎందుకు మాస్టారూ! అది మీ శ్రీమతి గారికోసం కొన్న చీర కాదూ!" ఆ చీర తన చేతిలోకి తీసుకుని పరిశీలిస్తూ అంది. నాలో ఏదో ధైర్యం హటాత్తుగా చోటు చేసుకుంది.

"అవుననుకో! అయినా ఈ ఊళ్లో నిన్ను చూశాక ఇది నీకు ఇవ్వాలనిపించింది" అన్నాను.

"అబ్బ! 'బ్యూటిఫుల్' సెలక్షనండీ! ఇది తప్పకుండా నేను తీసుకుంటాను" అంది

కాస్సేపుండి నేను వీధి గదిలోకి వెళ్ళి లైటు తీసేసి పడుకున్నాను. ఆమె ఆ మధ్య గదిలోనే ఉండిపోయింది. రెండు గదులకూ మధ్య తలుపు తీసే ఉంది! ఆమె గదిలోకూడ దీపం ఆరిపోయింది.

## చైతన్యా !

చైతన్యా !
నువ్వు నాతో నడిస్తే
యువతకు అందిస్తాను స్నేహ హస్తం
నువ్వు నాతో జతకడితే
సమతకు రూపం పోస్తాను.

చైతన్యా !
నీ పేరు కవితకు ఊపిరి
నీ గళం వికసించే ఉషస్సు
నా కళానికి నువ్వే తేజస్సు.
నిన్ను చూడడం కోసం
మనసు నిండా పెంచుకొన్న ఓపిక
అదీ–గుండె లోతుల్లో వెలుగుతూన్న దీపిక.

మనసు కళ్లకు అగుపిస్తుంది నీ రూపు
మమతా మనసులను చూస్తుంది నీ చూపు.
తపించే మనసులో ఝరిలా
ప్రాణం పోసుకొంటావు నువ్వు.

చైతన్యా !
నీ మాటలో వుంది మేలుకొలుపు
నీ పాటలో వుంది జాతికి గెలుపు
నీ జీవిత మంతా జిలుగు తెలుపు
కవి మనసుకు నీ పేరే తలపు
అందుకే కలమెత్తి గళమెత్తి ఈ పిలుపు.

– రంగినేని సుబ్రహ్మణ్యం.

# రమా-నేనూ-సరోజా

గంటసేపు గడిచినా నాకు నిద్ర వచ్చే సూచనలేవీ కనిపించలేదు. మనసంతా ఏదో దాహంగా- తీరని ఆశతో అశాంతిగా బాధ పడుతున్నాను

"ఆమె దగ్గరకు వెడితే! అరుస్తుందా? ఇంత అభిమానం, గౌరవం చూపిన ఆమెను తను అవమానించినట్లవుతుందేమో! అయినా అసలామె ఎందుకు నన్ను ఇంత దూరం తెచ్చినట్లు? కేవలం మా పాత పరిచయాన్ని పురస్కరించుకుని ఇంత చేసిందా? లేక—వేరే ఏదయినా ఉద్దేశ్యం ఉంటే తను అంత 'కావ్'గా ఎలా ఉంది? అవును—మరి, ఆమె ఆడది అంతకన్నా ఏ స్త్రీ మాత్రం పురుషుడికి 'గ్రీన్ సిగ్నల్' ఇవ్వగలదు ? నాకేదన్నా కోరికా, ధైర్యం ఉంటే నేనే చొరవ చూపాలి."

ఇలా ఆలోచించి, ఆలోచించి, లేచి ఆమె గుమ్మంవరకూ వెళ్లాను. మళ్లా ఏదో సంకోచం, భయం. అక్కడే తారట్లాడుతున్నాను.

హఠాత్తుగా ఆమె గదిలో లైటు వెలిగింది. ఉలిక్కిపడ్డాను. నేనిచ్చిన చీర కట్టుకుని ఆమె నిలబడి ఉంది.

"ఏం మాస్టారూ! నిద్రరావటంలేదా?" నవ్వుతూ అడిగింది. ఆ నవ్వులో ఏదో కవ్వింత ఉన్నట్లే తోచింది. ఎలా ధైర్యం చెయ్యాలో తెలీటంలేదు. ఆతృత, ఆవేశం, ఆశ! అన్నీ కలిసి నన్ను అయోమయంలో పడవేశాయి.

"రమా! ఇందాక నువ్వు ఆటో దిగే ముందు నేను ఏం ఆలోచిస్తున్నానో తెలుసా? చెబితే నమ్ముతావా? నిజంగా నీ గురించే..."

"అంతా అబద్ధం" ఓరగా చూస్తూ అంది.

"రమా! నేను కలలోనైనా ఆశించలేని అనుభవాలు నాకు ప్రసాదించాలని వచ్చావు. అడగనిదే వరాలిచ్చిన దేవతవు. నీకు నేనెలా కృతజ్ఞతలు తెలుపుకోను ?"

ఆమె "అంతంత మాటలు వద్దు. అయిదేళ్ల క్రిందట, అంటే మీ దగ్గర నేను చదువుకునే రోజుల్లో ఇది జరిగి ఉంటే, మీ కృతజ్ఞతలకు నేను అర్హురాలినై ఉండేదానివేమో! ఇప్పుడు అంత కృతజ్ఞత అనవసరం."

నేను ఆశ్చర్యంగా అడిగాను, "ఏం ?"

"నేను అనాఘ్రాత పుష్పాన్ని కాదుగా."

ఆమె ఇంకా చెప్పసాగింది, "సినిమాలలో చేరడం కోసం నేను నా శరీరాన్ని ఖర్చు చేసుకోలేదు కాని, సరైన సంపాదన లేని పరిస్థితులలో కూడ ఖరీదైన జీవితం పట్ల వ్యామోహంవల అతి విలువైన నన్ను నేనే కొద్దిగా ఖర్చుచేసుకున్నాను! కాని నాకు నేను మిగుల్చుకోగలిగింది కొద్ది "అభిరుచి" మాత్రం. నన్ను ఆకర్షించిన వారికే అమ్ముడు పోయాను. కాని నన్ను కొనుక్కుంటున్నామన్న అహంభావాన్ని ఎవరిలోనూ సహించలేదు. అంతేకాదు— నా మీద నాకే అసహ్యం కలిగే స్థితికి ఏనాడూ రాకూడదని, అందుకు తగిన జాగ్రత్తలన్నీ తీసుకున్నాను. అయినా, విచిత్రం! నామీద నాకు అసహ్యం కలిగే రోజు— వైరాగ్యం కలిగే రోజు— ఎంతో దూరంలో లేదని పిస్తోందిప్పుడు.

ఆమె మనసు విప్పుకుంటోంది. నన్నేదో తెలీని నీరసం ఆవహిస్తోంది. మాటలు లేకుండా వింటున్నాను.

"ఇప్పుడు నామీద మీకు ఇందాకటి ఆకర్షణ లేదుకదూ! కాని, నేనుచెప్పిన ఆ పతనమే జరుగకపోయి ఉంటే ఈ రోజు పిలిచి మీకు అందేదాన్ని కాదు." ఆమె సన్నగా నవ్విన నవ్వు వేయి గొంతులుగా నన్ను అపహాస్యం చేస్తున్నట్లనిపించ సాగింది. నా అల్పత్వాన్ని ఎవరో వేలెత్తి చూపుతున్నట్లు బాధపడసాగాను.

నా మనసు అర్థం చేసుకున్నట్టుగా అంది—

"నా మాటలకు బాధ పడుతున్నారా మేస్టారూ! ఈ రోజు మిమ్మల్ని చూడగానే గతించిన రోజుల నా ప్రాభవం అతి 'గ్లామరస్'గా గుర్తుకు వచ్చింది! ఆ రోజుల్లో, నాకున్నదీ, ఇప్పుడు లేనిదీ ఒకటే- నన్ను చూసి నేను గర్వపడడం. అప్పట్లో నాతో పరిచయం ఉన్నవారిలో ఎంతమందో నన్ను కోరి ఆశాభంగం పొందారు. కోరిక ఉన్నా బయట పడనిది మీరొక్కరేనేమో! బహుశా అందుకే ఈరోజు నాకునేనై మిమ్మల్ని కోరుకున్నాను."

ఇదా స్త్రీ హృదయం! కించిత్తు గర్వరేఖ వాలో పొడచూపినా, మనసులో ఉద్రేకం

శింగార్ వారి కాటుక

'78 సంవత్సరపు స్వాభావిక సౌందర్యానికి సంపూర్ణ నేత్ర శృంగారం.






శింగార్ మొదటిసారిగా పులుముకోనవసరంలేని కాటుక డీలక్స్‌ను ఆరోగ్యకరమైన మరియు ఆకర్షణీయమైన డబ్బీలలో ప్రవేశపెట్టినారు.

కాటుక కనులకు చక్కటి రూపు ఇస్తుంది. అంతేకాక నిర్మలంగానూ, చల్లగానూ వుంచుతుంది. నేత్రముల అంతరాళాన్ని పెంపొందింపచేసే స్వాభావికమైన కాంతిని ఇనుమడింపచేస్తుంది. సంపూర్ణ నేత్ర శృంగారానికి కాటుక అత్యవసరం.

## శింగార్ వారి కాటుక

స్వాభావికమైన రక్షణ మరియు సౌందర్యానికి పసిపిల్లలకు కూడా ఆదర్శప్రాయం.

CONCEPT-SK-3561 TEL

తగ్గిపోయి, రకరకాల ఆలోచనలు ముసురుకోసాగాయి. కొంచెం బాధపడుతూ అన్నాను—

"కాని, రమా! నీ జీవితం ఏటువైపు వెడుతోంది! దయచేసి నీ జీవిత పథాన్ని మార్చుకో! ఈ ప్రపంచానికీ, నాలాంటి వాళ్ళకూ కేవలం కలల్లో మాత్రమే చేరువ కాగల ఉన్నత స్థానంలోకి ఎగ్రబాకి పో"— నా గొంతులో ధ్వనించిన 'సిన్సియారిటీ'కి, జాలికీ, ఆమె కరిగిపోయింది. కృతజ్ఞతతో నన్ను కౌగిలించుకుని ఏడ్చేసింది.

అంతలోనే తేరుకుని, "చాలా థాంక్స్ మేష్టారూ! బహుశా కొద్ది రోజుల్లోనే నా భావి జీవితాన్ని గురించి ఏదో నిర్ణయం తీసుకుంటాను. సరైన వరుడు దొరికితే పెళ్లి చేసుకుంటానేమో కూడా! కాని పాడైన నా జీవితాన్ని గురించి ఏమీతెలీని అమాయకుణ్ణి మాత్రం మోసం చేయలేను" నేను మౌనంగా వింటున్నాను. ఆమె వెళ్ళిపోయింది.

*    *    *

నేను మరో రెండు రోజుల్లో మావూరెళ్ళిపోయాను. మా ఇంటికి తాళం వేసి ఉంది. ప్రక్కవాటా వాళ్ల అబ్బాయి తాళంచెవి తెచ్చిఇస్తూ, సరోజ రాసిన ఉత్తరం కూడా ఇచ్చివెళ్లాడు. వాళ్ల పుట్టినింటి వద్ద నుండి వెంటనే బయలుదేరి రమ్మని ఉత్తరం రాగా తను వెడుతున్నాననీ, నన్ను కూడ శలవు పెట్టుకు రమ్మనీ అందులో భావం.

*    *    *

ఆ మర్నాడు సాయంత్రానికి వాళ్ల ఊరికి వెళ్లాను. అంతా హడావిడిగా ఉంది. మా తోడల్లుడికి— అంటే సరోజ అక్క మొగుడికి స్కూటరు యాక్సిడెంటు అయిందట. అతణ్ణి ముందుగా పరామర్శించాను.

"పెద్ద గాయాలేవీ తగల్లేదుగానీ, వెన్నెముక కాస్త 'ఎఫెక్టు' అయింది బ్రదర్! కొన్నాళ్ళు పక్కమీద నించి లేవ వద్దని ఆంక్ష పెట్టాడు డాక్టరు" అన్నాడతను నవ్వుతూ

'హాయిగా సేవలు చేయించుకోవచ్చు లెండి' అనబోయి సభ్యత కాదని ఊరుకున్నాను.

ఆ రాత్రి పడుకోబోయేలోగా సరోజ నాతో ఒక్కమాట కూడా మాట్లాడలేనంత హడావిడిగా ఉంది. ఆ బావగారి సేవలన్నీ తనే ఏందుకు చేస్తుందా అని చిరాకేసింది. ఆ మాటే అడిగాను, రాత్రి కలుసుకోగానే.

"అదేమిటండీ అలా అంటారు! వాళ్ళు అంత బాధలో ఉంటే కాస్త సహాయం చేయడం తప్పా? మా అమ్మ పెద్దదీ, అనారోగ్యం మనిషీనూ..." అప్పటికి ఆ 'టాపిక్' ఇంకా పొడిగించడం అర్థరహితమని గ్రహించి. ఆమెను దగ్గరకు తీసుకున్నాను.

"మద్రాసు నుంచి ఏం తెచ్చారు?" అడిగింది.

"ఈసారి ఏమీ తేలేదే" అన్నాను. ఆ విషయంలో ఆమె ఏమీ తర్కించకపోయినా, నా మనసులో నాకే 'కించ'గా ఉంది నేను చేసిన పనికి. ఈమె కోసం కొన్న చీర మరొకామెకు బహూకరించడమే కాదు — అదేచీరలో ఆమెనిచూసి మురిసిపోయాను...

ఆలోచించి, ఆలోచించి, నన్ను నేను ఒక రకంగా సమర్థించుకున్నాను. ఈ ప్రపంచంలో అసలు ఏది తప్పు?

అక్కడ రెండు రోజులుండి బయలుదేరాను. సరోజ నాతో వస్తుందనుకున్నాను. ఆమె బయలదేరే ప్రయత్నాలు ఏవీ చేయక పోవడం చూసి, కారణం అడిగాను. ఇంకా కొన్నాళ్ళు అక్కడే ఉంటానంది. ఆమె

తండ్రి సరిగ్గా ఆ సమయానికే అక్కడికి వచ్చి దాన్ని (సరోజను) కొద్ది రోజులు అక్కడ ఉంచవలసిందిగా మరీమరీ కోరాడు. నాకు ఇష్టం లేకపోయినా వాళ్ళను అక్కడే ఉంచి నేనొక్కణ్ణే బయలుదేరి వెళ్ళాను.

వారం రోజులు ఒక్కణ్ణే గడిపేసరికి ప్రాణం విసిగిపోయింది. మళ్ళా నాలుగు రోజులపాటు శలవు పెట్టి తిరిగి వెళ్ళాను— ఈసారి ఎలాగైనా సరోజనీ పిల్లల్నీ తీసుకు రావాలన్న సంకల్పంతో.

ఆ రోజున నాలో కలిగిన అనుమానం వంటిది మాత్రం ఎవడికీ ఎప్పుడూ రాకూడదు. అమితంగా బాధపడి మనశ్శాంతికి దూరమయ్యే పరిస్థితులలో ఒక్కసారిగా పడిపోయాను. నాకంతగా కలవరం కలిగించిన దృశ్యం— సరోజా, దాని అక్క మొగుడూ కలిసి చదరంగం ఆడుతున్న దృశ్యం. అసలే వంటరితనం నాలో కలిగించిన కోపానికి తోడు, ఆ సన్నివేశం కలిగించిన ఆవేశంతో ఊగిపోయాను. ఆ పక్షిగాడు మంచంమీద దిండ్లు పెట్టుకుని దర్జాగా కూర్చుంటే ఈవిడ ఆ మంచానికి అతి సమీపంలో కుర్చీలో కూర్చొని ఉంది. ఇంట్లో ఎవరి పనుల్లో వాళ్ళున్నారు. వాళ్ళెవరికీ ఇది విడ్డూరంగా కనిపించలేదా? ఆఖరికి వాడి పెళ్ళానికి కూడా!

హఠాత్తుగా అంత కోపం మింగలేకా, పైకి వెళ్ళబోసుకోలేకా నేను పడ్డ అవస్థ ఆ పరమాత్ముడికే తెలియాలి. సభ్యత కోసం చచ్చినట్టు నవ్వుతూ మాట్లాడవలసిన ఖర్మ ఒకటి!

నాకూ సరోజకీ ఏకాంతం దొరికినది చాలా రాత్రివేళ. వెంటనే నా మనసులో ఉన్న కోపమంతా బైటకొచ్చేసింది పదునైన మాటలతో. అదేమీ పెద్ద విషయం కానట్టు అతి తేలికగా తీసిపారేసిందామె. ఇంకా పెద్ద గొంతుతో ఏదో మాట్లాడబోతుంటే దాని నోరు మూయించి నా పరువు బయట పడకుండా చూసుకోవడానికి తల ప్రాణం తోక కొచ్చింది.

ఇంక ఆ విషయం అక్కడ మాట్లాడి లాభంలేదనీ ఇంటికెళ్ళినాక తేలవలసిందేననీ నిశ్చయించుకున్నాను. దానికెలా బుద్ధి చెప్పాలా అన్న ఆలోచనలతో, కోపంతో నా బుర్రకి సరైన ఆలోచన కూడా రావటం లేదు.

"తెల్లవారుతూనే మన ప్రయాణం. అన్నీ సిద్ధం చేసుకో" తీవ్రంగా అన్నాను.

"లేడికి లేచిందే పరు"గన్నట్టు ఏమిటండీ అంత తొందర? ఇంకొక్క రెండు వారాలయినా ఇక్కడుండనివ్వండీ, ప్లీజ్". ఆమె అభ్యర్థనపట్ల నాకే మాత్రం సానుభూతి గలుగకపోగా, కసి, అసహ్యం పెరిగిపోయాయి.

"ఏం! నీ బావగాడితో కులకడానికి రెండు వారాలు సరిపోతుందా?" కసిగా అడిగాను.

"ఏమిటండీ ఆ బుద్ధిలేని మాటలు! మీకేమయిందసలు?" అంటూ ఏదో సర్ది చెప్పబోతుండగా...

"నోర్ముయ్! మొగుడి కంటే ఇతర వెధవల్ని ఎక్కువగా చూసే నీలాంటి దాని మొహం చూడ్డం కూడా మహాపాపం. నువ్వసలు నా ఇంటికి రానేరావద్దు ఇక్కడే తగలడు" అంటూ ఆ క్షణిక కోపంలో అప్పటికప్పుడే బయలుదేరి వెళిపోయాను.

రమాకి, సరోజకి తేడా ఏముంది? అనుకున్నాను— అప్పటి నుండి రెండు మూడు రోజులపాటు మానసికంగా నరకమే అనుభవించాను.

నిజంగా ఆ బావగాడికీ సరోజకీ ఏదన్నా సంబంధం ఉందేమోనన్న ఆలోచన శూలంలా పొడవసాగింది. నాకున్న సర్వాస్నీ ఎవరో దోచుకున్నట్టు, ఏమీలేని వాడిగా నేను మిగిలిపోయినట్టు భావం కలిగి ఏ పనిమీదా ఆసక్తి లేకుండా పోయింది.

ఇన్నాళ్ళు నాతో కాపురం చేసిన మనిషేనా అది! నేను, పిల్లలు తప్పించి వేరే ఏ ధ్యాసా లేని మనిషి ఇలా ఎందుకు ప్రవర్తించింది? నేను కోపగించుకుని వచ్చానని తెలిసి కూడా నిమ్మకు నీరెత్తినట్టు అక్కడ ఎలా ఉండగలిగింది? నేను వదిలేస్తే... సరోజా, నా పిల్లలూ నేను లేకుండా ఉండగలరా? అసలునేను ఇలా ఎంతకాలం గడపగలను? ఏమి కాబోతోంది మా సంసారానికి?

అసలు ఆ ఇంట్లోవాళ్ళు మనుషులేనా? ముఖ్యంగా సరోజ అక్క... నాలో ఇంత కలవరం కలిగించిన ఆ విషయాలు దానికేమీ అనుమానం కలిగించలేదా? ఈ ఆలోచన వచ్చినపుడు మాత్రం నేనేమయినా పొరపాటుగా ప్రవర్తిస్తున్నానేమో అన్న ఆశ కలిగేది. కాని మొత్తం మీద నాకు కలిగిన అనుమానం పెనుభూతమై నన్ను వేధించింది.

మనసులో ఈ సంఘర్షణ జరిగేటప్పుడు అనేకసార్లు నాకూ రమకూ మధ్యన జరిగిన సంగతి గుర్తుకువచ్చేది నేను చేసిన తప్పుకు ఇది శిక్ష? అనిపించేది. నిజానికి నేను కొంత పొరపాటు చేసి ఉన్నా సరోజ పట్ల నా బాధ్యత మరచిపోలేదు. ఆమెకు అన్యాయం చేయాలన్న ఉద్దేశ్యం కించిత్తు కూడా లేదు! చేయలేను కూడా!

కాని, నా అనుమానం నిజమైతే మటుకు, అందువల్ల ప్రత్యక్షంగా ఎంత మందికి అన్యాయం జరుగుతుంది? ప్రతి చర్యకూ ఒక ప్రతిచర్య ఉంటుందన్నది భౌతికశాస్త్ర సూత్రం. ఆ రకంగా చూసినా ఆ తప్పుకు ఇంతశిక్ష న్యాయమా? అని నన్ను



నేను ఓదార్చుకుంటూ రెండు రోజులు గడిపాము, రోజూ ఒక యుగంలా. మూడో రోజున వచ్చింది ఒక ఉత్తరం. భయం భయంగానే ఉత్తరం తెరిచి చదవసాగాము.

"మై డియర్ సారూ!

బహుశా వింతతో ఆగ్రహంతో ఉండి ఉంటారు కదూ ఈపాటికి! అంత కోపం మీకు వస్తుందని తెలిసి కూడా నేను గమ్మున ఉన్నానంటే, అందుకు తగ్గ కారణం ఉందన్న నా ధైర్యానికి కారణం నాకు మీమీద ఉన్న నమ్మకం మాత్రమేనని అంటే మీరేమంటారు? మీ మామూలు పద్ధతిలో "ఆడదాని కింతటి వ్యక్తిత్వం కూడ"దంటారా!

ఇక అసలు విషయానికి వస్తాను. మా బావకు జరిగిన 'యాక్సిడెంటు'లో వెన్నెముక దెబ్బతిన్నదని మీకు తెలుసు గదా! దాని విషయంలో కొన్ని పరీక్షలూ, అవసరమైన ట్రీట్‌మెంటూ అయ్యే వరకూ అతను దాంపత్య జీవితానికి దూరంగా ఉండాలనీ, అందుకు ఏమాత్రం లేడా జరిగినా అతనికి చాలా ప్రమాదమని హెచ్చరించారు డాక్టర్లు. ఈ విషయం అతనికి తెలీకుండా ఉండడం మంచిదనీ, లేకుంటే "సైకలాజికల్"గా 'డిప్రెస్' అయ్యే అవకాశం ఉన్నదనీ కూడా చెప్పారు.

ఆ విషయం మా నాన్నగారు నాకూ, అక్కకీ మాత్రం చెప్పి, అక్కను అతని దగ్గర ఒంటరిగా ఉండకుండా— అదీ అతను గమనించలేనంత నేర్పుగా చేయమని అడిగారు. ఇక ఈ విషయం మీ దగ్గర కూడా దాచిన కారణం— అక్క రిక్వెస్టు.

మీరు చూసినవీ, మీకు కోపం, బాధ కలిగించినవీ అయిన సంఘటనలన్నీ ఈ కారణాన జరిగినవే. మీ ప్రేమ మీద, మీ గొప్పతనంమీద, నాకున్న నమ్మకం నాకు ఆ మాట ఇచ్చే ధైర్యాన్ని ఇచ్చింది. అర్థం చేసుకుని క్షమిస్తారు కదూ!

మరో శుభవార్త— బావకి నిన్ననే చిన్న 'ఆపరేషన్' చేశారు. అతను ఇప్పుడు కులాసాగా ఉన్నాడు. మరికొన్ని రోజులలో మామూలు మనిషి అవుతాడు. అక్క ప్రాణం కుదుట పడింది.

నేనూ పిల్లలూ రేపు 'మెయిలు' లో బయలుదేరి వస్తున్నాం. స్టేషనుకు రండి.

మీ సరోజ.

* * *

సరోజ సైన్సు స్టూడెంటు. తప్పా. శిక్షల విషయంలో నా ఎనాలిసిస్సూ, నేను భయపడిన విషయమూ, అందుకు కారణము ఒక్కటీ దాచకుండా చెప్పేశాను.

కాస్సేపు ఏడ్చింది. కోపగించుకుంది. రెండు మూడు రోజులలో పూర్తిగా శాంతించింది.

"మీరు చేసినది అక్షరాల తప్పే. విప్పు తెలిపి ముట్టుకున్నా, తెలీక ముట్టుకున్నా

## పెట్రోలుకి బదులు చెరకురసం

బ్రెజిలు దేశంలో చెఱకునుంచి తీసిన రసంతో కార్లను నడుపుతున్నారట. ఈ రసాన్ని కొన్నిటితో చేర్చి కారుకు ఇంధనంగా తయారు చేసే ఫ్యాక్టరీలు అక్కడ నూటడెబ్బయి వున్నాయట. ఆ కలిపే పేవీ ప్రమాదమైనవి గాపోతే పెట్రోలు టాంకునిండా చెఱకు రసం పోసుకుని, ప్రయాణం మధ్యలో ఆటాంకులోంచి రసం తీసుకుని సేవించవచ్చుకూడా!

## తొమ్మిదో పెళ్ళి తెచ్చిన తంటా

టర్కీకి చెందిన ఎడిరమ్ అనే పట్టణంలో కమాల్ అనే వో యువకుడు తొమ్మిదో పెళ్ళి ఘుంఘుమ్మని చేసుకున్నాడట. ఈ పెళ్ళికి అతని మాజీ భార్యలు కూడా విచ్చేశారట. విందు అనంతరం అతను వొకొక్క మాజీ భార్యతోనూ గడపవరకూ వెళ్ళి, వీడ్కోలిచ్చి తిరిగిరావడం ఆరంభించారట. ఈ తతంగం చూసిన కొత్త పెళ్ళికూతురు "వాటీజ్దిస్" అని తన మాతృ భాషలో చికాకుపడి, ముద్దూ చూసి, పెళ్ళిచూడ్డాని కొచ్చిన పెళ్ళికొడుకు స్నేహితుల్లొకడ్ని చూసి "ఓ డార్లింగ్! బిలవ్డ్!" అనేసి వానితో లేచి చక్కాపోయిందట. ఎనిమిదో మాజీ భార్యను సాగనంపి తిరిగొచ్చిన కమాల్ తన తొమ్మిదో భార్య సాగనంపే అవకాశం యివ్వకుండానే వెళ్ళిపోయిందని తెలిసి ఆ దేశపు పద్ధతిలో శివతాండవం చేశాడట.

## నాట్యం సాంప్రదాయం కాదా!

పాకిస్థాన్ దేశంలో ఇకనుంచి టెలివిజనులో నాట్య సంబంధమైన ప్రదర్శనలను చూపరాదని ఆ ప్రభుత్వం నిర్ణయించుకున్నదట. అదేమన, ఆ దేశపు సత్ సాంప్రదాయ సిద్ధాంతాలకు నాట్యం విరోధి అట. యిన్నాళ్ళూ తెలీలేదేమి విషయం!



## గుజరాత్‌లో హరిజనులపై అఘాయిత్యాలు

గుజరాత్ రాష్ట్రంలో 1974-1977 సంవత్సరాల మధ్యకాలంలో 36 మంది హరిజనులు హత్య చేయబడ్డారట. 96 మంది తీవ్రగాయాలు తగిలి చావును చూపువాసిలో తప్పించుకున్నారట. 13 మంది హరిజన అమ్మాయిలు బలాత్కరింప బడి శీలం పోగొట్టుకున్నారట. 17 జబర్దస్తి దొమ్మీలు జరిగాయట.

## ఆరుగుర్ని పెళ్ళాడిన అతివ!

ఝాన్సీకి చెందిన రజా అనే గ్రామానికి చెందిన ఒకామె ఇంతవరకూ ఒకరికి తెలియ కుండా ఒకరుగా ఆరుగుర్ని పెళ్ళిచేసుకున్నదట. ఈమె చేసుకున్న ప్రతీ పెళ్ళిలో కట్నం పేర కొంతడబ్బు కాను గుంజుకున్నదట. ఆరో పెళ్ళిలో వో హరిజన యువకుని వద్ద వెయ్యి రూపాయలు గుంజుకునేసరికాతను పోలీసులతో మొరపెట్టుకుంటే వాళ్ళొచ్చి యిదంతా తెలిశారట.

## వెల్లుల్లి మేలు!

వెల్లుల్లి వుపయోగం చాలా అమోఘమైనదట. ఈ వెల్లుల్లి వుపయోగంవల్ల గుండె జబ్బులు రానే రావని వైద్య విజ్ఞాన శాస్త్రం చెప్పుకుంటోందట. పశ్చిమ జర్మనీలో యీ వెల్లుల్లి పంటకు, పండించే వారికి మంచి మంచి డిమాండట.

## కుటుంబనియంత్రణలేని రష్యా

రష్యాలో కుటుంబనియంత్రణ సాధనాలు దొరకనే దొరకవట. ఆ దేశానికి పిల్లలు కావాల్సినందువల్లా, జనాభా పెరగాల్సినందువల్లా ఆ పరికరాల అమ్మకాలను నిషేధించిందట ఆ దేశం. రష్యనులు పొరుగుదేశాలు వెళ్ళి తిరిగొచ్చేటప్పుడే పరికరాలను చాటుమాటుగా తీసుకుపోతున్నారట-వ్వాట్! స్మగ్లింగా! 'పోయి పోయి కుటుంబనియంత్రణ సాధనాలనా! ఎవరి కేవి దొరకవో వాటికే కదా గిరాకి పెరిగేది.

## పుర్రెల గిరాకీ!

క్రిష్ణగర్ అనే పూళ్ళోని రైల్వేస్టేషనులో వో యువకుడు చేతిలో వో పెద్దపొట్లంతో తచ్చాడు తున్నాడట. అతని వాలకం చూస్తే అనుమానంగా వుండి పోలీసులాపొట్లాన్ని సోదాచేస్తే అందులో వో ప్లాస్టిక్ సంచిలో రెండుపుర్రెలువున్నాయట. ఏమిటిది అని గద్దించి అడిగితే కలకత్తాలో యీ పుర్రెలకు మంచిగిరాకిగా వుందనీ, మంచిరేటిచ్చి కొనేవారున్నారనీ ఆ పాంథుడన్నాడట.

## సినిమాచూస్తూ భయపడి చనిపోయిన వృద్ధుడు

ఢిల్లీలో వో థియేటరులో ఇంగ్లీషు సినిమా "ఎగ్జార్సిస్ట్" చూస్తున్న 60 ఏళ్ళ ముసలాయన కెవ్వున కేకవేసి కొయ్యబారి, పోటీపడట. వేగంగా తలుపు వరకూ వచ్చి, అక్కడ వున్న పాటున చనిపోయాడట.

## కిలో వెయ్యిరూపాయలా!

జమ్ముకు చెందిన రీజ అనే వో వూరిలో 75 కిలోల బరువున్న వో వయ్యారిని ఓపెన్ మార్కెట్టులో డెబ్బయ్యయిదువేల రూపాయలకో పుణ్యాత్ముడు అమ్మాడట. ఆమెబరువూగొప్పదని, పెలంలో ఆమెరేయీ గొప్ప దేవని వో చూపరి అన్నాడట. కిలో వెయ్యిరూపాయలా! అట్లా లెక్కవేయరాదు.

కాలుతుందన్నది నిజం. కాని మీరనుభవించా లనుకుంటున్న బాధకంటె ఎక్కువ శిక్షార్హమైనది కాదులెండి మీ తప్పు. అక్కడికే న్యూటన్ మూడో సూత్రం సరిపోయింది" అంది న్యాయమూర్తిలాగా.

"నా అనుమానం నిజమవుతుందేమో నన్ని, అంత పెద్ద శిక్ష విధి నాకు విధిం చిందేమోనని ఎంత బాధపడ్డానో తెలుసా!"

"అంతకు పదింతలు తప్పు చేసినా మీకా శిక్ష పడదు. సరా!" అభయ మిస్తున్నట్టు, లాలనగా అంది.

"ఇంత మంచి గుణం స్త్రీకెలా వచ్చింది సరూ?"

"అది మీ పురుషులకు దేవుడిచ్చిన వరం గుర్తూ!"



# వారఫలం

17-11-1978 శుక్రవారం మొదలు
23-11-1978 గురువారంవరకు

**మేషం :** ప్రయాణాలు ఫలిస్తాయి. వ్యాపార విస్తరణ ప్రయత్నాలు బాగుంటాయి. మీ మంచి తనమే మీకు యిబ్బందిని కలిగిస్తుంది. స్థిరాస్తి వ్యవహారాలు బాగుంటాయి. మున్ముందు లాభించ గల వ్యవహారాల్లో అభివృద్ధిని సాధిస్తారు. స్త్రీలకు — పుణ్యకార్యాలు చేస్తారు. సంతోష కరమైన వార్తలను వింటారు.

**వృషభం :—** నూతన వ్యవహారాలు లాభిస్తాయి. రావలసిన డబ్బు అందుతుంది. రాజకీయ వ్యవహారాలు బాగుంటాయి. మిత్రులకు సహాయం చేస్తారు వారం ఆఖరులో అన్నివ్యవహారాల్లోను ఫలితం సామాన్యంగా ఉంటుంది. స్త్రీలకు— కుటుంబ వ్యవహారాలు బాగుంటాయి. దైవ కార్యాలు నెరవేరతాయి.

**మిధునం :—** వృత్తి వ్యాపారాలు బాగుంటాయి. ఉద్యోగంలో గౌరవంలభిస్తుంది. మీ ఆలోచనలు ఫలిస్తాయి. విద్యా వైజ్ఞానికరంగాల్లో మీ కృషి రాణిస్తుంది. అధికారులవలన జరగవలసిన వ్యవహారాలు బాగుంటాయి. స్త్రీలకు—ఆరోగ్యం బాగుంటుంది. వినోద కాలక్షేపాల్లో పాల్గొంటారు.

**కర్కాటకం :—** వ్యతిరేకమైనవార్తలనువింటారు. సాహసిక వ్యవహారాల్లో నష్టం వస్తుంది. వారం మధ్యలో మీ ప్రయత్నాలు ఫలిస్తాయి. వ్యాపారంలో ఆదాయంబాగుంటుంది. ప్రయోజనం గల పరిచయాలు యేర్పడతాయి. స్త్రీలకు— కుటుంబ వ్యవహారాలు బాగుంటాయి. అధిక వ్యయం జరుగుతుంది.

**సింహం :—** రావలసిన డబ్బు అందుతుంది. వృత్తిలో నూతనావకాశాలు లభిస్తాయి. వారం మధ్యలో శ్రమ కలుగుతుంది. మీ తాలూకు



వస్తువులు పోవచ్చును వారం ఆఖరులో అన్ని వ్యవహారాలు తిరిగి బాగుంటాయి. స్త్రీలకు— కుటుంబ వ్యవహారాల్లో కార్యభారం పెరుగుతుంది. వినోద కాలక్షేపాల్లో పాల్గొంటారు.

**కన్య :—** అధికారులవలన జరగవలసిన వ్యవహారాలు బాగుంటాయి. ప్రయాణాలు ఫలిస్తాయి. వ్యాపారంలో ఆదాయం బాగుంటుంది. మిత్రుల సహాయం లభిస్తుంది. వారం ఆఖరులో మీ ప్రయత్నాలకు ఆటంకాలు వస్తాయి. స్త్రీలకు— పోటీవారిలో గౌరవం బాగుంటుంది. పుణ్య కార్యాలు చేస్తారు.

**తుల :—** నూతన వ్యవహారాలు బాగుంటాయి. మిత్రులకు సహాయం చేస్తారు వృత్తిలో ముఖ్యమైన వ్యక్తులను కల్సుకొంటారు. స్థిరాస్తి వ్యవహారాలు బాగుంటాయి. సాహసిక వ్యవహారాలు లాభిస్తాయి. స్త్రీలకు—విలాస వస్తువులుకొంటారు. శుభకార్యాల విషయంలో అనుకూలత లభిస్తుంది.

**వృశ్చికం :—** చేజిక్కిన అవకాశాలు కూడా జారి పోవచ్చును. వృత్తిలో శ్రమ కలుగుతుంది. వారం మధ్యలో మీ కార్యక్రమాలుబాగుంటాయి. రావలసిన డబ్బు అందుతుంది ఉద్యోగంలో గౌరవం లభిస్తుంది. స్త్రీలకు ఆరోగ్యం బాగుండదు. బంధుమిత్రులను కల్సుకొంటారు.

**ధనుస్సు :—** ప్రయోజనంగల పరిచయాలు యేర్పడతాయి. ప్రయాణాలు ఫలిస్తాయి. వారం మధ్యలో ప్రయాస కలుగుతుంది. సాహసిక వ్యవహారాల్లో నష్టం రాగలదు. వారం ఆఖరులో వృత్తి వ్యాపారాలు బాగుంటాయి. స్త్రీలకు— కుటుంబ వ్యవహారాలు బాగుంటాయి. అనవసరమైన వ్యయం జరుగుతుంది.

**మకరం :—** మీ కార్యక్రమాలకు మార్పులు వస్తాయి. ఎవరితోను మాట పట్టింపులు తగవు. రావలసిన డబ్బు అందుతుంది. ఉద్యోగంలో గౌరవం లభిస్తుంది. వారం ఆఖరులో లాభం రావలసిన వ్యవహారాల్లోనే నష్టం రావచ్చును స్త్రీలకు-ఆరోగ్యం బాగుంటుంది. దైవకార్యాలు నెరవేరతాయి.

**కుంభం :—** వృత్తి వ్యాపారాలు ప్రోత్సాహకరంగా ఉంటాయి. మిత్రులసహాయంలభిస్తుంది. రాజకీయ వ్యవహారాల్లో శ్రమ కలుగుతుంది. అనవసరమైన సందేహాలు కలుగుతాయి. ఉద్యోగంలో గౌరవం బాగుంటుంది. స్త్రీలకు— కుటుంబ వ్యవహారాలు బాగుంటాయి. సాహిత్య కళారంగాల్లో ఖ్యాతి లభిస్తుంది.

**మీనం :—** ఆర్థిక వ్యవహారాల్లో మొగమాటాలు తగవు. పోటీవారిలోగౌరవంలభిస్తుంది. సాహసిక వ్యవహారాలు బాగుంటాయి. వృత్తిలో ఆదాయం పెరుగుతుంది. వారం ఆఖరులో మీ అంచనాలు తారుమారు కాగలవు. స్త్రీలకు-ఆరోగ్యం బాగుంటుంది. దైవకార్యాలు నెరవేరతాయి.

—మహేష్ ●




# నీరజ పెళ్ళి

పెద్దింటి విజయలక్ష్మి

ఇష్టం లేకుండా, బలవంతం మీద, అద్దం ముందు కూర్చుని ముస్తాబౌతూంది నీరజ !

మనసుకి బాగా నచ్చిన చీర కట్టుకోలేదు, యిష్టం లేనిదేదో తీసి చుట్టుకుంది.

ఇష్టమైన ముత్యాలసెట్టు నలంకరించుకోలేదు. ఊబుసు పోకక్కొన్న మామూలు గొలుసు వేసుకుంది.

అందంగా, అక లమధ్య గుల బీలు పొందుపరచి, తల్లో ముడవలేదు ! పడుకుని లేచిన జుత్తుని పైపైన దువ్వుకుంది.

'మాచింగ్ గురించి మాట వరస కన్నా ఆలోచించలేదు వని మనిషిలా కనబడకుండా, కాస్త శ్రద్ధ పడిందంతే ! ఆమె మనసంతా అసంతృప్తి, ఆక్రోశాంతో నిండి వుంది సంఘ జీవులెంతో మంది వున్నా, బాధకి తానొక్కర్తే అన్నంత బాధ! అంతా యాంత్రికం ! ఈ యాంత్రిక యుగంలో తానూ ఓ యంత్రం !

ఇంతకీ, ఆరోజు ప్రత్యేకత ఏమంటె, తనని చూసుకోటానికి ఎవరో వస్తున్నారు!

మరైతే, ఆమెలో ఆ 'పులకింత' లేదెందుకో! ఇదామెకు సారి, సారికి మనములో బరువుని పెంపుతూ వస్తున్న, అలవాటైన పనైపోయింది. ఈ నాటకం ఒక్కసారా, రెండుసార్లా! ఇది పదమూడో సారి! మొదటి రెండుసార్లు, తానూ అనుభవించిందా పులకింత! కానీ, ఆ తర్వాత నుంచి నైరాశ్యమే! పులకింతకు బదులు, ఒళ్ళంతా పురుగులు పాకినట్టుగా వుందిప్పుడు!

అందరి ముందూ కూర్చుని, కూర్చుని లేవటం ఆమెకు కావలసిందివ్వలేదుగాని, అవమానాన్నే మిగిల్చింది. వ్యక్తిత్వాన్ని చంపింది. మనసుని నలిపిపారేసింది. దుర్భర భారాన్ని పెంచింది! పళ్ళు బిగబెట్టి, పన్నెండుసార్లూ అలా కూర్చుని లేచింది. ఇక భస్తే అపని చేయనని పెద్దగా ఏడ్చింది.

కానీ, రావటానికైతే వస్తున్న సంబంధాలను, ప్రయత్నించకుండా వదిలేసుకోటానికి యిష్టంలేదు. నీరజఅమ్మా,నాన్నలకు! 'ఈ ఒక్కసారికే. యిక నిన్ను బాధ పెట్టము. ముసలి వాళ్ళని కాస్త జాలితలచు' అంటూ ఆమె కాళ్ళా, వేళ్ళాపడి, నెత్తీనోరూ బాదుకున్నారు. తలితండ్రుల ఆ పరిస్థితికీ నీరజ కళ్ళు చెమర్చాయి. అందరిఆడబడుచుల్లాగ, ఆ వయసులో పెళ్ళి కావాలన్న కోరిక తనకు వున్నట్టుగా, అందరి తలితండ్రుల్లా కూతురికి పెళ్ళిచేసి, కళ్ళారా చూసి ఆనందించాలని తన తలితండ్రులకుండటం కూడ సహజమేనని గ్రహించింది. అందుకే, ఆఖరి సారిగా వాళ్ళ దగ్గర ఒట్టువేయించుకుని, యీ ఒక్కసారికి తలవంచింది. తయారైంది.

సాయంత్రం ఐదింటికల్లా వస్తామన్న పెళ్ళివారు వచ్చేశారు ఠంచనుగా !

వివరాలన్నీ ముందే తెలిసుంటాయి గనుక, చూట్టానికి పెళ్ళి కొడుకు, అతనితో యింకెవరో వస్తే చాలదు ! ఉహుఁ యింటిల్లిపాదీ, పెళ్ళికొచ్చినట్టు తరలి రావటమే ! 'ఇంట్లో ఓ బొచ్చు కుక్కని పెంచితే దాన్ని తెచ్చే వారేమో' అన్నట్టుగా వస్తారు, ఓ పదిమందికి తక్కువ లేకుండా ! చివరికి, ఆ బొచ్చు కుక్క ఆమోదం కూడ కావాలేమో !

కుదరక పోయినా, ఆ నాటి నుంచీ యిలా వచ్చి పోయే వారిని ఓ స్వీటూ, ఓ హాటూ, చెరొక కప్పుడు కాఫీతో మేపుతూనే వున్నారు- తన వాళ్ళు ! ఏం ఒరక్కపోయినా, అప్పులు మట్టుకు మిగులుతున్నాయి.

ఆడపిల పెళ్ళి చేసిన తర్వాత అప్పు మిగిలినా, అదొక సంతృప్తినైనా మిగిల్చేదేమో! కానీ, యిప్పుడు అంతా శూన్యం'!

సాంప్రదాయమట, సాంప్రదాయం!

మనిషి వ్యక్తిత్వాన్ని లాగి పడేసి. అతన్ని

అన్ని విధాలా బలహీన పరిచే యీ సాంప్రదాయం ఎందు కింకా కొనసాగుతూందో అర్థం కాదు !

'అమ్మాయిని చూట్టానికి వచ్చినప్పుడు. ప్రొద్దున భోజనం కూడ సరిగా చేయలేవో- వాళ్ళు పెట్టింది బాగా మెక్కటందుకు కడుపులో బోల్డు ఖాళీ వుండాలని !' అనిపిస్తుంది నీరజకు.

రావటానికి ముందర, వాళ్ళింట్లోనో, లేదా ఏ హోటల్లోనో తిని, "మా కోసం శ్రమించి, మీరేమీ తయారుచేయ నవసరం లేదు మేము తినే వస్తున్నాము" అంటే ఎంత బావుణ్ణు ! ఇదికూడ అనిపిస్తుంది నీరజకు.

కానీ. సాంప్రదాయ రద్దుకి ఏ యుగం రావాలో ! నీరజకు యీ తతంగం అంతా యిష్టం లేకపోయినా, చేసేదేం లేక, వచ్చి పెళ్ళి వారి ముందు కూర్చుంది. ఆమె ముఖంలో కళకన్నా, పరిశీలిస్తే, అణగారి వున్న ఆత్మాభిమానం కనిపిస్తుంది !

అలావచ్చి కూర్చున్న క్షణం నుంచీ, తానొక షోకేసులో జీవంలేని బొమ్మలాగ, కసాయి వాడి ముందు కట్టిపడేసిన మేకలాగ తలచి మానసికంగా విలవిల్లాడి పోతుంది.

ఆడదనగానే, ఎం దు కీ దుర్భరస్థితి నెదుర్కోవాలి ? పెళ్ళికొడుకుల్ని చూసే నిమిత్తం, తామే వాళ్ళింటి కెందుకు వెళ్ళ కూడదు ! కొన్నాళ్ళు తమకూ యీ మర్యాదల నందుకునే అవకాశం ఎందుకు

# నీరజ పెళ్ళి

రుచి చూపించ కూడదు ? అవతలి వాళ్ళు ఏమైపోయినా సరే, ఆ ఆలోచన లేకుండా వేలకు వేలు కట్నాలు పుచ్చుకునే అవకాశం ఆడపిల్లని కన్నవాళ్ళకి కూడ కొన్నాళ్ళివ్వ కూడదా ? అప్పుడు తెలిసి వస్తుంది, యిదెంతటి కఠిన శిక్షో అని ! ఇలా, జరుగుతున్న నేటి సాంప్రదాయం తల్లక్రిందులైతేనే, యీ వ్యవస్థలో మార్పు రాగలదు! లేకుంటె యింతే యీ కష్టం వారికేనాటికీ తెలిసిరాదు. మార్పులేదు !

తిరుగుబాటు ధోరణిలో ఆలోచిస్తున్న నీరజకు, తండ్రి మాటలు వినిపించాయి.

"అమ్మాయిని ఏమన్నా, అడగాలనుకుంటె అడగండి." ఆ మాటలు విన్న నీరజకు ఒళ్ళంతా కారం రాచినట్లుగా వుంది. తనకీ పరీక్షలన్నీ అనవసర మనిపించినా ఆ క్షణంలో ఆమె అబల ! అవతలి వాళ్ళ అభిరుచికి తగినట్లు తల వంచాల్సిందే!

ఆ మాట కొస్తే, తన కుండవా అభిరుచులు ? పెళ్ళికొడుకుని తానూ ఎందుకు ప్రశ్నలు వేయకూడదు ? తనని ప్రశ్నల వర్షంలో ముంచెత్తే, అతని బంధువర్గాన్ని తానూ ఎందుకు ప్రశ్నించ కూడదు.

ఊహూ, ఆ పని తాను చేయుటం అసభ్యాతి !

"నీ పేరేమిటమ్మా ?" ముందుగా ప్రశ్నించి నావిడ పెళ్ళికొడుకు తల్లి.

"పేరు తెలియకుండానే యింత దూరం వచ్చిందా ?" అని మనసులో యీసడించుకుని, "నీరజ" అంది ఏ భావమూ పలక్కుండా !

"సంగీతం వచ్చా ?"

లేకుంటే, మాకు పనికిరాదన్నట్లుంది అతని తండ్రి ప్రశ్న !

"నేర్చుకో లేదు"

ఏమైతే తనకేం అన్నట్లు సూటిగా వుంది నీరజ సమాధానం.

"మీకు లలిత కళలంటె యిష్టమా?"

తన కుందో, లేదో. అన్నకు భార్యగా వచ్చే దానికి తప్పకుండా వుండితీరా లన్నట్లుగా వుంది అతని చెల్లెలి ప్రశ్న! కొద్దిగా వున్నప్పటికీ, నీరజకు బింకం వచ్చింది.

"లేదు" అంది ముక్క విరిచినట్లుగా.

నీరజ సిగ్గుతో చచ్చిపోయి, వంచిన తల ఎత్తకుండా కూర్చోలేదు.

హాయిగా, అందర్నీ బాగా చూస్తూనే కూర్చుంది. పెళ్ళికొడుకు, తన స్నేహితునికి సైగ చేస్తున్నాడు, "నువ్వూ ఏదో అడుగు" అని.

నీరజకు, అతని చర్య యింకా ఒళ్ళు మండిపోయేలా చేసింది.

"చేసుకునేది నువ్వా? నీ స్నేహితుడా?" అని అడగాలనిపించింది. కానీ, ఆ స్నేహితుని అడగాలన్న కోరిక వున్నప్పటికీ, జంకువల్ల కాబోలు, "వద్దు" అన్నట్లు చెయ్యి వూపాడు.

అదీ గమనించింది నీరజ.

"బతికావు పో, లేకుంటే, యివ్వాళ నీ తిక్క కుదిరేదాన్ని" అనుకుంది మనసులో.

లేకుంటే, వాళ్ళ తరపుగా, ఎందరొచ్చి, ఏదడిగినా, తాను అతివినయంగా సమాధానం యివ్వాలి. అప్పుడే మంచి. లేకుంటే, "మాకు మీ పిల్ల వద్దు" అని వెళ్ళిపోతారు. ఇక, తమకు మిగిలింది నిరాశలూ, నిట్టూర్పులూను.

తమూ ఓ యింటికి యిల్లాలై, తల్లై, హాయిగా, మనస్ఫూర్తిగా బ్రతకాలని ఏ యువతికి వుండదు ? ఎన్నిసార్లని, దిన్నాళ్ళని యీ పరీక్షలకు ఓరిమి వహించి, ఊరుకుంటుంది ?

ముట్టుకుంటే, భగ్గుమనేలా అయింది నీరజ.

ఇక, పెళ్ళి కొడుకులుంగా



సైన్సులో సరదాలు

# పొమ్మని తోస్తే తిరిగివచ్చే డబ్బా

ఈ గారడీకి కావలసిన వస్తువులు :— 1. పెద్ద గుండ్రని ఖాళీ డబ్బా, 2. పొడుగుపాటి బలమైన రబ్బరు ముక్క. 3 దారం, 4 బరువైన ఇనుప ముక్క.

పెద్ద పాలపొడి డబ్బా గానీ, మరేదైనా గుండ్రని పెద్ద ఖాళీ డబ్బా గానీ – మూత ఉన్నది అవసరం ఈ డబ్బా మట్టులోనూ, మూతలోనూ మేకుతో మూడు నాలుగు అంగుళాలు ఎడంగా, రెండేసి చిల్లులు పొడవాలి. బలమైన రబ్బరు ముక్కను ఈ నాలుగు చిల్లులలో నుంచీ దూర్చి, బిగించి, ముడి వెయ్యాలి. డబ్బా లోపల, సరిగ్గా మధ్యలో రెండు రబ్బరు ముక్కలను దగ్గరగా లాగి అక్కడ ఒక బరువు కట్టాలి. పాత తాళం గానీ, మరి ఏదైనా ఇనుప వస్తువుగానీ ఇందుకు పనికి వస్తుంది.




ఇప్పుడు ఈ డబ్బాని నేలమీద పెట్టి, ఎదరకి తోస్తే దొర్లుకుంటూ కొంత దూరం వెళ్ళి, ఆగి, మళ్ళీ వెనక్కి దొర్లుకుంటూ బయలుదేరిన చోటికే వచ్చి ఆగుతుంది!

ముందుకి తోసినప్పుడు డబ్బా దొర్లుకుంటూ ముందుకి పోతూ ఉన్నప్పుడు లోపల కట్టిన బరువు ఉన్నచోటనే ఉండి, రబ్బరు తాళ్ళని మెలితిప్పుతుంది. మళ్ళీ మెలిక విడిపోయినప్పుడు వెనక్కి దొర్లుకుంటూ వస్తుంది.

లోపల ఉన్న రబ్బరు ముక్కలకి బరువు కట్టేవని తెలియని మీ స్నేహితులు ఈ గమ్మత్తు చూచి చాలా ఆశ్చర్యపడతారు

*డాక్టర్ మహీధర నళినీమోహన్*

వంతొచ్చింది. ఆయన ఆయనకు తోచిన అనుమానాలన్నీ ప్రశ్నలుగా కురిపించే హక్కుని మరీ మరీ పొందిన వ్యక్తి!

మొదలు పెట్టారు,

"నీ గ్రూపేమిటి?"—చెప్పింది.

"నీ డేట్ ఆఫ్ బర్త్ ఏమిటి?" చెప్పింది.

"నీకు బాగా వండటం చేతనౌనా?"—చెప్పింది.

"ఇదీ ఓ ప్రశ్నే" అనుకుంది. "కాస్త మర్యాద యివ్వటం కూడ నేర్చుకోండి" అనాలనిపించింది. అయినా, అప్పటికి వూరుకుంది.

"నీకు కాలేజీలో బాయ్ ఫ్రెండ్స్ వున్నారా?"

'ఈ ప్రశ్న దేనికో' అనిపించినా, 'లేరు' అంది ఓ నిముషం ఆలోచించి! ఆ తర్వాత, "మీకు గర్ల్ ఫ్రెండ్స్ వున్నారా?" అని అడగాలని పించింది. కానీ అతని వంతు యింకా ముగియలేదని తెలిసి వూరుకుంది.

"నావెల్స్ చదవటంలో యింటరెస్ట్ వుందా?" విసుగ్గా వుంది నీరజకు.

'ఛట్' మని కొడదామని పించింది. అయినా మనసులో, "శాంతి, శాంతి" అనుకుంది. "చదువుతాను" అంది ముక్తసరిగా.

"ఎలాంటివి? సెక్సువా? లవ్ స్టోరీసా?"

నీరజ యిక వుండలేక పోయింది. ఇతనిలాంటి చచ్చు ప్రశ్నలు వేస్తుంటె, చుట్టూ వున్న వాళ్లంతా వూరుకున్నారేమిటి? అని ఆశ్చర్యపోయింది.

కొద్దిగా ఆమె కన్నుల్లో నీళ్ళు తిరిగాయి కూడ!

గమనించాడు పెళ్ళికొడుకు.

"మీరంత సీరియస్‌గా తీసుకోవలసిన అవసరం లేదు. "ఇటీజ్ ఎ కామన్ థింగ్" అని సర్దబోయాడు. "నీ పిండా కూడు" అనుకుని భగ్గుమన్న మనసుతో లేచి నిలబడింది నీరజ.

"చూడండి మిస్టర్, కాలక్షేపానికి, సరదాకి మీకు కావాలంటె ఆడవాళ్ళు వేరే దొరుకుతారు. ముందు నన్ను పెళ్ళి చేసుకోవటం యిష్టమేనా? లేదా? అన్న దానికి జవాబివ్వండి. అదే యిక్కడ తేలాల్సిన విషయం, మీ అర్థం లేని ప్రశ్నలకు జవాబులు కావు" అని, కారిపోతున్న కన్నీటిని తుడిచేసుకుని, లోపలకు వెళ్ళిపోయింది నీరజ.

అనుకోని ఆ పరిణామానికి అందరూ శిలలైపోయారు.

పెళ్ళికొడుకు మొహం నల్లబడ్డది!

వాళ్ళవాళ్ళ మొహాలు కందాయి!

నీరజ తలితండ్రుల మొహాలు పాలిపోయాయి!

ఎలాగో తేరుకుని,

"అమ్మాయికి యివాళ కాస్త నలతగా వుంది. ఆ విసుగులో ఏదో అనేసింది. తప్పుగా భావించకండి క్షమించండి" అంటూ చేతులు నలుపుకుంటున్నాడు నీరజ తండ్రి!

తల్లి గాభరాగా నిలుచుండి పోయింది.

"మేము వెళ్ళి వుత్తరం వ్రాస్తామండి" అని వెళ్ళిపోయారు వచ్చిన వాళ్ళు.

'ఏమి వ్రాస్తారో, ఎలా ఒప్పుకుంటారో, అంతా సర్వనాశనం చేసి పెట్టింది' అని, వయసొచ్చిన కూతుర్ని పైకి ఏమీ అనలేక లోలోపల అనుకున్నారు నీరజ తండ్రి. ప్రయాణంలో సగానికి పైగా దూరం వెళ్ళిన తర్వాత, యింజన్ ఫెయిలై బండాగిపోయినంత నిస్పృహ వాళ్ళలో ప్రవేశించింది. ఏమి చేయాలో వాళ్ళ కర్థం కాని పరిస్థితిలో ఆ వుత్తరం వచ్చింది

"మీ అమ్మాయి మా అబ్బాయికి నచ్చింది. ముహూర్తాలు పెట్టించండి" అన్న శుభవార్త!

# నీరజ పెళ్ళి

ఇంటిల్లిపాదీ, ఆశ్చర్యానందాలలో మునిగి ఎంతో దూరం వెళ్ళిపోయారు!

"అమ్మాయి అలా ప్రవర్తించినా, దేవుడు ముందరే ముడివేసి పెట్టాడు కాబట్టి, వాళ్ళని ఆ దేవుడే ఒప్పించాడు" అని పొంగిపోయింది నీరజ తల్లి.

నీరజ పెళ్ళి జరిగిపోయింది. ఆమె కూడ మరో గృహిణి ఐపోయింది.

మొదటి సారిగా, భర్తతో ఏకాంతంలో వున్నప్పుడు అంది నీరజ,

"ఆ రోజు చూపులకొచ్చినప్పుడు మీకు అతి దురుసుగా సమాధానం చెప్పాను. అది అహంభావమని మీరు భావించారేమో గానీ, నాలో పేరుకుపోయిన బాధాతిశయమే అలా ప్రతిధ్వనించింది. నన్ను క్షమించండి. నేటికీ నాకు అతి ఆశ్చర్యకరమైన సంగతి, మీరు నన్ను చేసుకోటానికి అంగీకరించటం. ఓర్పు వీడి, అంత దురుసుగా అన్న నిమిషమే నేను నిర్ణయించుకున్నాను, 'తప్పిపోయిన సంబంధాల్లో యిదీ ఒకటి' అని. కానీ, మీరు మానవాతీతులు. నన్నే చేసుకున్నారు. నేటి నుంచీ నా దైవం మీరే" అంటూ క్షమాపణ కోరింది భర్తని.

అందు కతను,

"లేదు నీరజా, తప్పు నీదే కాదు: మాలో కూడ వుంది. ముందర తెలియలేదు కానీ, యింటి కొచ్చిన తర్వాత మీ యింట్లో జరిగిన దాని మీద చర్చ చేసుకున్నాము. మా మామయ్య ఒకాయన వున్నారు, ఆయన గొప్ప ఆదర్శవంతుడు. ఇలాంటి సనాతన సాంప్రదాయాలన్నీ నచ్చవు ఆయనకు. అందుకే, పెళ్ళిచూపులకు రమ్మని పిలిచినా రాలేదు. అప్పుడాయన ఓ 'పిచ్చివాడు'గా తోచాడు మాకు. కానీ, యిదంతా విన్న తర్వాత, ఆయన నీ పరంగా ఆలోచించి, అప్పటి నీ మనోస్థితి ఎలా వుంటుందో వివరించారు. తప్పు మాదే నని మమ్మల్ని నిందించాడు. ఆయన నోటి మాటలు వింటుంటేనే, మా అందరి మనసుల్లోనూ మార్పు రాసాగింది. నువ్వు చివరి సారిగా కన్నీళ్ళు తుడుచుకుంటూ, లోపలకు వెళ్ళిపోయిన దృశ్యమే నా కళ్ళ ముందు నిలవసాగింది. నీ బాధ నా కర్థమైంది నీరజా! వెంటనే నేను చెప్పాను, నిన్నే చేసుకుంటానని. మా అమ్మ, నాన్నగారు కూడ ఏమీ అనలేదు.

నీరజా, మూడుముళ్ళూ వేసిన తర్వాత నీ మీద పొందాల్సిన హక్కుని నేను ముందుగా కోరినట్లు ప్రవర్తించానారోజు. పెళ్ళై, తృప్తి నిండిన మనసుతో యిచ్చే జవాబుకీ, యిటు, అటు తేల్చకుండా విసిగించేనాడు యిచ్చే జవాబుకీ చాల తేడా వుంటుంది. ఆ మనోప్రవృత్తి అలా వుంటుంది గానీ, తప్పు నీది కాదు. నువ్వు కూడ నన్ను క్షమించాలి. మానసికంగా, ఓ అనుభూతిని పొందాలి గానీ, పెళ్ళిళ్ళ కట్టుకానుకలమీద, పనికిరాని సంప్రదాయాల మీద ఆధారపడకూడదని తెలుసుకున్నాను నీరజా!

"జరిగిందేదో జరిగిపోయింది. అయాం సారీ! రేపు మన పిల్లల కా ఫ్రీడం యిచ్చేద్దాంలే" అంటూ నీరజకు యింకా దగ్గరగా జరిగాడు నీరజా నాధుడు!

ముందు అతన్ని మరో రకంగా భావించిన నీరజ యిప్పుడు మనస్ఫూర్తిగా, అతనికి తనని తా నర్పించుకుంది!

## దోమలు కుట్టలేని దుస్తులు

దుర్భరమైన శీతోష్ణ పరిస్థితులు గల సైబీరియా, దూర ప్రాచ్య ప్రాంతాలలో బైకాల్-అమూర్ రైల్వే నిర్మాణం సాగిస్తున్నవారికి మాస్కో జౌళి సంస్థ ప్రత్యేక రకం ప్రాయోగిక దుస్తులను సరఫరా చేసింది. దోమలను దూరంగా పారద్రోలే పదార్థంతో రూపొందించిన ప్రత్యేకమైన నూలుతో యీ దుస్తులను తయారు చేశారు. ఈ కొత్త దుస్తులు దోమ కాటు నిరోధానికి బాగా వుపకరించడంతో యిప్పుడీ దుస్తుల తయారీ భారీ ఎత్తున సాగుతూవుంది.

మరో సంస్థ అగ్ని నిరోధక ఊలు దుస్తులను తయారు చేసింది. ఇవి నిప్పులో వేసినప్పటికీ కాలవు. ఈ సంస్థ క్రిమి నిరోధక నూలును సైతం రూపొందించింది. వైద్య శాస్త్ర వేత్తలు యీ దుస్తులను ప్రశంసించారు.

# మీరే చెప్పాలి

'మానస'



రామారావు పెద్ద వ్యవహర్త.

పంచాయితీ సమితి మొదలుకొని లోక సభా... రాజ్యసభా దాకా ఏ పనైనా క్షణాల మీద చేసేస్తాడు, చేయించేస్తాడు.

ప్రతిఫలాన్ని పెద్దగా ఆశించినట్టు కనపడడు. ఆ మాటకొస్తే అనలడగడు కూడా! జరిగే పనిని బట్టి... ఇంతనుకుని ముట్టచెబుతూంటారు. అలా ఇస్తే కాదనడు.

ఆదే అసలు వ్యాపార రహస్యం అంటారు కొంతమంది జనాలు. (రామారావు అవసరం లేనివాళ్ళో.. అవసరం తీరిపోయినవాళ్ళో..!)

ఫలానా మంత్రినో... ముఖ్యమంత్రినో ఈజీగా పట్టుకోవచ్చుగానీ... రామారావలా దొరకడు.

అయితే ఓపికుంటే ఓ సులువుమార్గముందతన్ని దొరికాయాలంటే! ఏవరిపనిమీద ఎక్కడికి వెళ్ళాడో ముందుగా తెలిస్తే... అక్కడికెళ్ళి ఆమ్మాకీ మొహలెట్టి బయల్దేరితే... ఓ ఇరవై పాతికచోట్లు తిరిగేలోపల దొరికిపోతాడు.

రామారావుతో పెద్ద పరిచయం లేదు నాకు మొదట్లో. అందరికీ అన్నీ చేసి పెట్టే రామారావు తన స్వవిషయంలో నన్నాశ్రయించాల్సొచ్చిందోసారి. చేసిపెట్టాను

అలా చెయ్యడంలో నా స్వార్థం ఉంది గనుక:

ఏవి చెయ్యడంలో జాప్యం అయినా... ప్రతిఫలం ముందే సమర్పించుకున్నా..., లేక పందలూ వేలూ వ్యాపారరీత్యా అతని చేతుల్లో పెట్టేసి కూర్చున్నా..., మెత్తాని కెలాంటి ఒప్పందంలో దిగినా... అసం దిగ్ధంలో పడ్డా..., జనాలు కుక్కిన పేనుల్లా ఉండిపోతారుగానీ... నోరెత్తి అడగరు. సూక్ష్మంగా చెప్పాకోవాలంటే ... చిరునవ్వు నవ్వుతూ కనబడే రామారావుని చిరునవ్వుతోనే పలకరిస్తారుగానీ...ఇతరత్రా నోరెత్తరు.

ఇందాక చెప్పాను కదా ... నా స్వార్థం ఉండి నేను సాయం చేశానని. నా పని మేరకు కాపు కాస్తే ... వారం రోజులకి దొరికాడు రామారావు. అదీ పోస్టాఫీసులో ఏవేవో గబగబా ఉత్తరాలు రాస్తూ! హాల్లో రామారావుగారూ... అంటూ పలక రించబోయిన నేనలాగే ఆగిపోయాను — ఎదురుగా అరుస్తున్న ముసలాయన్ని చూసి.

"బుద్ధుండాలి మనిషి జన్మెత్తినందుకు. అన్నం తింటున్నావా ? గడ్డి తింటున్నావా? ఏ కోసం గాడిదలా కాళ్ళరిగేట్టు తిరగాలా? కొంపలో దొరకవు. దేశంమీదెక్కడెక్కడ తిరుగుతుంటావో తెలీదు. నీ పెళ్ళాన్నడిగితే గుడ్లప్పగించుకుని చూస్తుంది.

ఏమిటి దగాకోరుతనం...? ఏం చేశావు? దొడ్లో పంపు వేయిస్తాననీ... మునిసిపాలిటీ వాళ్ళకి లంచాలకీ పగ్గాలకి కొంత ఖర్చౌతుందనీ ... కంట్రాక్టుగా ఐదొందలు మాట్లాడుకుని తీసికెళ్ళావు. పత్తా అయిపే లేదు. నీ కన్నా ఈ మునిసిపాలిటీ బంట్రోతు నయం. ఇచ్చెయ్. నా ఐదొందలు నాకు. చేసిన నిర్వాకం చాలిక !"

"అది కాదండీ...!"

"మరింకేం మాట్లాడకు. ముందు డబ్బిచ్చేయ్ ! నిన్నింకా నమ్మడం నా బుద్ధి తక్కువ !"

"అది కాదండీ, ఎలాగా ఆగినవాళ్ళూ ఆగారు. రెండ్రోజులు ఓపికపట్టి మరొక్క అవకాశం ఇవ్వండి, మీరే చూద్దురుగాని దొడ్లో పంపు వేయించగలనో లేదో !" చిరునవ్వుతోనో... గంభీరమైన వ్యాపార సరళి నవ్వుతోనో వ్యవహరించే రామారావు చేతులు కట్టుకుని ఒకటోక్లాసు కుర్రాళ్ళా మాట్లాడుతున్నాడు.

# మీరే చెప్పాలి?

"ఊ! అలస్యం చెయ్యక. డబ్బియ్!" గొంతు చించుకున్నాడు ముసలాయన. సరిగ్గా ఆ సమయంలో చూశాడు నన్ను రామారావు గట్టిగా నిట్టూరుస్తూ!- నవ్వాను.

"మీ పనంతా రెడీసార్... ఇక మీదే అలస్యం" ఫ్రెష్‌గా నవ్వాడు రామారావు:

నా కళ్ళముందు జరిగిన సన్నివేశాన్ని... జరగబోయే తతంగాన్ని తల్చుకుంటే... గొంతుకలో పచ్చివెలక్కాయ పడ్డట్టైంది నాకు. అయినా మరో ఆలోచనకి అవకాశం కలగలేదు.

మాట్లాడకుండా జేబులోంచి డబ్బుతీసి అతని చేతులో పెట్టాను.

విప్పుడూ లెక్కపెట్టని రామారావు ఈ సారి లెక్కపెట్టి... ఐదొందలు విడిగాతీసి అంతసేపూ తిట్టిన ముసలాయనకిస్తూ...

'మీ పని మీరే చేయించుకోండి బాబూ: నాకూ శ్రమ తప్పుతుంది' అన్నాడు స్రమతగా !

డబ్బు పుచ్చుకుని విసురుగా వెళ్ళి పోయాడు ముసలాయన. మిగిలిన రెండొందలయాభై జేబులో పెట్టుకున్నాడు రామారావు.

మనసులో ఏదో పీకుతున్నట్టౌతోంది. ఆ అవమానం నాదే అన్నట్టు భావన. రామారావుకి అసాధ్యమైన విషయాలుంటాయన్న ఆలోచన వచ్చేసరికి వదిరెట నీరసం.

అయినా ఇప్పుడు నా చేతిలో ఏమీలేదు—

నే సమర్పించుకున్న డబ్బు నా కళ్ల ముందే చేతులుదాటి వెళ్ళిపోయింది! ఇకనైనా తెలివిగా వ్యవహరించి పని చేయించు కోడమే నాకు మిగిలిన దారి...

అందుకే...

"ఎవరండీ బాబూ, మిమ్మల్నే విదురించేస్తున్నాడు ? పని జరగాలనేనా ముసలాయనకి?" వ్యైరిగా డప్పు వాయించాను అవసరం కొద్దీ !

"మా నాన్నగారండీ...!" నవ్వాడు రామారావు.

కుశాయికోసం నేనిచ్చిన పిడుపందల యాభైకే పంపులో మంచినీళ్ళొస్తాయో... నా కన్నీళ్ళే వస్తాయో ఖచ్చితంగా మీరే చెప్పాలి.



# వంటలు

## పంచామృత్

కావలసిన వస్తువులు :— బెండకాయలు ముప్పావు కేజీ, చింతపండు— పెద్ద నిమ్మకాయంత, నువ్వుపప్పు గుండ— 3 చెంచాలు, వేరుసెనపప్పు గుండ — 3 చెంచాలు, పచ్చిమిరప కాయలు — 4 లేక 5, గరిటెడు నూనె, ఇంగువ, ఆవాలు, కరివేపాకు, కొద్దిగా మెంతులు, పసుపు, ఉప్పు, బెల్లం, ( తీపి ఇష్టం ఉన్నవాళ్ళు నిమ్మకాయంత వేసికోవచ్చును.)

తయారు చేయు విధానము:— ముందుగా బెండకాయలు కడిగి పుచ్చులు లేకుండా పెద్ద పెద్ద ముక్కలుగా తరుగుకొనవలెను. అంటే ఒక కాయని రెండు లేక మూడు ముక్కలుగా తరుక్కోవలెను. చింతపండుని ఒక గ్లాసు నీళ్ళలో నానపెట్టి వుంచుకోవాలి. నువ్వుపప్పుని వేరుసెనగపప్పుని వేరువేరుగా నూనెలేకుండా వేయించి మెత్తగా పొడి కొట్టి వుంచుకోవలెను.

బాణలి పొయ్యిమీద పెట్టి గరిటు, గరిటు న్నర నూనె వేసి ముందుగా ఇంగువ, ఆవాలు రెండు మెంతులు, కరివేపాకు వేసి పోపు వేయించుకుని, తరిగి వుంచుకున్న బెండ కాయ ముక్కలు వేసి వేయిస్తూ వుండాలి. తరువాత పచ్చిమిరపకాయలని కూడా నిలువుగా తరిగి చిన్నచిన్న ముక్కలుగా చేసికొని బెండకాయలతో పాటు వేయించు కోవాలి. బెండకాయలు బాగావేగాక ఒకగ్లాసుడు నీళ్ళు పోయాలి. అవి తెల్లుతూ ఉడుకుతూ వుండగా పసుపు, బెల్లం, చింతపండు గుజ్జు వెయ్యాలి. బాగా కలియ పెడుతూవుండాలి. కొంచెము ఉడికిన తరువాత (చింతపండు గుజ్జు ) వేరుసెనగ గుండ, నువ్వుపప్పు గుండ వేసి బాగా కలిపి దింపేముందర ఉప్పు వేసి బాగా కలియపెట్టి దింపుకోవాలి.

—టి. ఉషా సుందరి.

Printed and Published by S. NageswaraRao at the Andhra Patrika press, MallikarjunaRao Street, Gandhinagar, Vijayawada-3. Editor: S. Radhakrishna




# ఐ.ఓ.బి.యొక్క పొదుపు సలహాదారుని సంప్రదించండి. అతడు మీకు తోడ్పడగలడు.

మిమ్ము బ్యాంకు ప్రణాళికలు కలవర పెట్టుచున్నవా?

ఏ ఐ.ఓ.బి. బ్రాంచినైనా సంప్రదించండి. మీ పొదుపు సలహాదారులు మీకొరకై వేచియున్నారు. వారు మీ ప్రణాళికలను విమర్శించరు. వారు సులభముగా పొదుపు చేయుటకు అవసరమైన పన్ను సౌకర్యములను మరియు ఇతర అవసరములను గూర్చి సలహా నిచ్చెదరు.

మీ కుమారుని చదివించవలెనా? మీ కుమార్తె సంతోష వైవాహిక జీవితమును చూడవలెనా? మీకు స్వగృహము కావలెనా? మీ భవిష్యత్తు స్థిరముగా నుండవలెనని ఆశించుచున్నారా?

మా పొదుపు సలహాదారులు మీ కొరకు ప్రత్యేక పథకములను సూచింతురు. అది ఏక ప్రణాళిక గాని లేక అనేక ప్రణాళికలు కలిగియున్నదిగా యుండవచ్చును. మీకు కావలసినదల్లా క్రమముగా పొదుపు చేయవలెనను ధృడాభిప్రాయము.

నేడో రేపో సంప్రదించండి. మా పొదుపు సలహాదారులు ఎల్లవేళలా మీకు తోడ్పడుటకై వేచియున్నారు.

**ఐ.ఓ.బి.కి వేంచేయండి. మీకొరకు మావద్ద గొప్ప పథకములు గలవు.**

**1969 నుండి జాతీయ బ్యాంకులన్నింటిలోను అత్యధికమైన 771% పెరుగుదల పొందిన ఐఓబి మీ పట్ల గల సన్నిహితాశక్తిని వెల్లడించును.**

ప్రతి ఐ.ఓ.బి. బ్రాంచివద్ద మీ కొరకై పొదుపు సలహాదారులు వేచియున్నారు.






**ఇండియన్ ఓవర్సీస్ బ్యాంక్**

మీ ఔన్నత్యాన్నికోరే ఉత్తమ మిత్రుడు

Sista's-IOB/53/78 Tel

